శ్రీ శుభమస్తు.

శ్రీ హరిహర గురుభ్యోన్నమః.

ఇది శ్రీదక్షిణహైదరాబాదయిలాకా శికింద్రాబాదులో చేరిన
తిరుమలగిరి బొరకాసుబాజారు నివాసుండగు
శ్రీమదుమారమణచరణకమలమరందపానమిళిందాయమానమానసుండును
శ్రీపూతిమాష సరుషితోటకుల గోత్రాన్వితుడును పూరిసంశేపయఃపారావార
రాకాసుధాకరుండును, వైశ్యకులోద్భవుండును, రాజయార్యపౌత్రుండును,
వీరయార్య జ్యేష్ఠపుత్రుండును నగు
రామలింగం- లింగయ్య యను ద్వినామంబులచే
వ్యవహరింపంబడు నాచే రచియింపంబడిన

# హరిహర గురుభజన కీర్తనలు.

ముముక్షులకత్యంతోపయోగంబగునటుల సులభశైలిగా దీనిని
పండితులచే బరిష్కరింపంబడి
శికింద్రాబాదయిలాకా తిరుమలగిరిబొరకాసు బాజారు నివాసులగు
వైశ్యశ్రీ రాజశ్రీ-పొద్దుటూరి-కృష్ణయ్య సహోదరులగార్ల
ద్రవ్యసహాయముచే శికింద్రాబాదునివాసియగు
గోపిశెట్టి - నరసింహులుశెట్టిగారి తమ్ముడయిన
జనరల్ బజారు బుక్ సెల్లరు
గోపిశెట్టి - నరహరిశెట్టిగారిచే

మురహరిముద్రాక్షరశాలయందు
ముద్రించి ప్రచురింపబడియె
మొదటికూర్పు ౨౦౦౦.

1--6--1905







# ప్ర క ట న.

శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః.

ఈగ్రంథమున్ను యిదిగాక సంస్కృతాంధ్ర గ్రంథములున్ను యింకా అనేక నూతన గ్రంథములున్ను మంచికాగితములలోముద్రించియున్నది. కాబట్టి~~వలయువారలు యీచిరు~~ వచేవ్రాలుచేయుమాపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

ఇట్లు,

గోపిశెట్టి - నరహరిశెట్టి.

జనరల్‌బజారు. శికింద్రాబాదు.



శ్రీ ర స్తు.



శ్రీ హరిహర నాథాయనమః.



# హరిహర గురు భజనకీర్తనలు.





శా॥ శ్రీమాయాశ్రయుఁడై చరాచరజగత్సృష్టిస్థితిధ్వంసకృ
న్నామాశ్రేయంబున నేయు నిష్ప్రపంచమహః స్ఫూర్తిజ్ఞశక్తిన్ దారు
కాన్వ్యక్తానందవ్య నపజ్ఞప్తిల్ సులభానిర్వాణసంబు లేవ్వానికా
ధామానందమయుఁడ్ర రామయుని నేమ క్కృతిఃసైగాప్చడ॥

## శ్రీగణపతిప్రార్థన.

### ౧= సింధుకన్నడరాగం - ఆదితాళం.

పల్లవి.

ప్రణవాత్మకదేవ- గణాధిప॥ ప్రణ॥

అనుపల్లవి.

మునిగణనుతనిను - మనమున వేగము
ఘనముగ వేడితిని- గణాధిప॥ ప్రణ॥

చరణము.

౧॥ ఫాలమునను నిను- చాలగ గనియును
మేలును జెందితిని- గణాధిప॥ ప్రణ॥

౨. హృదయకమలమున- సదయా నీ వెప్పుడు
విదితమునుంటివిగా - గణాధిప॥ ప్రణ॥

౩. మేదుకొండలపై - మేడలో జోడు లేక
వేడుక వెలుగొందుగా- గణాధిప॥ ప్రణ॥

౪. సతతము నిను- చిత్ప్రకాశుడని
సతముగ నమ్మితినీ- గణాధిప॥ ప్రణ॥

౫. క్షేమతిర్మలగిరి- ధాముడు కృపతోడ
రామలింగని బ్రోవ్వా- గణాధిప॥ ప్రణ॥

### ౨= జంఝూటిరాగం- రూపకతాళం.

పల్లవి.

విఘ్ననాథ వేదవినుత- విశ్వకారణా॥ విఘ్న॥

అనుపల్లవి.

విఘ్ననివారణ- వినుతకారణ.. విబుధపోషణా॥ విఘ్న॥

౧. నాద మోద భేదరహిత- సాధుపోషణా
వేదభూషణ- వాదదూషణ- సదయమృదుచరణా॥ విఘ్న॥



౨. జ్ఞానరూప- విజ్ఞానమయ- జ్ఞానభూషణా
జ్ఞానజ్ఞానరహితపరము- జ్ఞానపోషణా॥ విఘ్న॥
౩. భావనాత్మక- భావరూప- దేవదేవశా
భావభావరహితపరమ- భావశ్రీవిభవా॥ విఘ్న॥
౪. ఈశతిరుమలాద్రివాస- పాశమోచనా
దాసపోషణ-యీశచిద్విలాసభూషణా॥ విఘ్న॥
౫. మంగళాంగ- లింగపోషణ- సంగదూషణా
మంగళాత్మసూప్రసిద్ధ- మంగళకరణా॥

౩= ఇంగ్లీషువర్ణమెట్టు- ఏకతాళం.

పల్లవి.

పిలచిపిలచితలచినాడ- ప్రేమరానదైవరాయ॥ పిలచి॥

అనుపల్లవి.

అలసిసొలసిఆశజెంది- కొలచెదనువిఘ్నరాయ॥ పిలచి॥

చరణము.

౧. విమలహృదయసువివేకీ- అమలబుద్ధినాకునొసగు
కమలసంభవాదివినుత- కారణాత్మకరుణజూడు॥ పిలచి॥
౨. పంతమేలవేగనాదు- చింతదీర్చిబ్రోవవేమి
దంతివదనమేకదంత- దయనుజూచిగావవే॥ పిలచి॥
౩. గుణమయనీ- గుణముల్లెల్ల- గణనజేయనేంతవాడ
జననమరణరహితనీదు- మననజేసిమొరనుజేయ॥ పిలచి॥
౪. యీశతిరుమలాద్రివాస- దాసరామలింగపోష
కానుపీసమదుగకెపుడు- దోసిలొగ్గివేడుకుందు॥ పిలచి॥

౪= హిందుస్తానికాఫి- ఆదితాళం.

పల్లవి.

భజరేమానస- శ్రీగణనాథం- అజభవవందిత
సుజనసుమోదం॥ భజ॥

౧. శాంతమనంత- చింతితచింతం
సంతోషాన్విత- సర్వదిగంతం॥ భజే॥

౨. నాదాతీతం- నగజప్రసూతిం
సాధువిభూతిం- సకలవిఖ్యాతం॥ భజే॥

౩. పాపవినాశం- ప్రణవప్రకాశం
తాపసమీశం- తపనప్రకాశం॥ భజే॥

౪. రాజరాజేశం- రామలింగపోషం
కామవిజితవర- కారణమీశం॥ భజే॥





## సరస్వతి ప్రార్థన.

నాటకురంజి రాగం- ఆట-లేక-ఏక తాళం.

పల్లవి.

శ్రీవాణి- శ్రీకర పాణి వా॥ శ్రీవా॥

అనుపల్లవి.

శేచరునందత-భావముగలిగిచరు- గావరాదశశాంకవదని
భావనాత్మకి-దివ్యసుందరి-శ్రీవనోసగియు-నన్నుబ్రోవుమి
తావకసదాసరసకృపతో॥ శ్రీవా

చరణము.

౧. మందగమనయా- నందయాబురాణి - సుందరిసుముఖివసినే
ముందుగా నుతించుతున్నమ్మా - వందితామరబృందమృదులర
విందకోమలపద- ద్వందియా- సురవందియా- గుణబృందయా
శ్రితవందియా॥ శ్రీవా॥

౨. శంకరాకరశుభాంగియు- నంగజితభాంగి- సంగరశూరివనినే
పొంగుచు నుతింతునమ్మా- యంగజితసారంగసద్గుణి-
మంగళంబుగనామనంబున- సంగియా-సారంగియా-వరభృంగియా
భవభంగియా వా॥ శ్రీవా॥

౩. జలధర వేణినా- వలనను నేరము- కలలోనైననే- వలనను నెంచక ప్రోవు
ఫలము లిచ్చియున్నన్నుగావుము- పాపనాశని-పద్మధృతశుభ
పాణియా-అళివేణియా-గుణశ్రేణియా-శుకవాణియా॥ శ్రీవా॥

౪. పరమపావనినా- శిరమునకరముంచి-ధరను తిరువళ్ళిరి
ధామిని నన్నుగావు- కరుణతోడను రామలింగసి- గాచియురక్షించు వేగ
మె-యానందియా-భూవందియా-గుణకంధియా-మునివందియా వా॥ శ్రీ

౬= ధన్యాసిరాగం- ఆదితాళం.

పల్లవి.

రాఘవవేశారదయని-నినునుదినిడి-రయమునగొలిచెదనూ॥ రాఘ॥

అనుపల్లవి.

రాఘవవేయనుచును- రయముగనిన్నును
కోరివిదనీపద- కువలయమేన్నెద॥ రాఘ॥

చరణం.

౧. నీవేకదమరిజగములనుండెడి - నిఖిలశాస్త్రములునూ
నీవేకదమరిసకలకావ్యములు- నియతినిబాడగనిలునావాక్కున॥ రాఘ॥

౨. ప్రణవవచసియని- అనవరతంబును- పరగగదలచెదనూ
ప్రణవాత్మకనిను-పరిపరివిధముల-ననయమువేడియు-ఘనముగగోరితి॥



౩. చదువులనెల్లను - కొదువలేకనిక - పదపడెనివ్వగనూ
వదలకనీపదసరసీరుహములు-మదినమ్మియునే- మరువకగొలిచెద॥ రా॥

౪. క్షేమతిరుమలాద్రీశనినిరతము- క్షేమమొసగగనూ
కామితార్థములు-కరుణచేనిచ్చియు-రామలింగనిప్రేమతో నేలుమీ॥ రా

౭= బ్యాండుగత్తు - ఆదితాళం.

రామారామా ప్రతి,

పల్లవి.

వాణీ-వాణీ-వాణీ-భ్రమరసు-వేణీ- నామొరవినుమ శ్రీశుక॥ వాణీ॥

౧. శరణే-భవభయ-తరణే-వరగుణ-భరణే-మృదువర-చరణే శుభకర॥ వా

౨. వరదే-గమన-ద్విరదే-వచన-శ్వరదే-బుధజనవరదే-పరతర॥ వాణీ॥

౩. జననీ-మునిజన-మననీ-మృదువచ-ఖనినీ-ప్రవిమల ఘనసనీ-సురచిర॥ వాణీ॥

౪. ధర శ్రీతిరుమల-గిరివర-స్థిరతర-వరదేలింగయ-హృదివేనివసిత॥ వాణీ॥

## గౌరిప్రార్థన.



౮= బేగడరాగము - ఆదితాళము.

ప ల్ల వి.

పరమపావని- పాపసంహారీ- పరగనునిటు
పరమసుందరి గిరిజరావిటు॥ పరమ॥

అ ను ప ల్ల వి.

కరగదామరిమనమునీకెట్లు - యేవిధమైన- మరుగుజేయకరావేసీవిట్లు
మొరజేయునిట్లు, పర॥

౧. తల్లినిను నెరనమ్మినానమ్మా - యుల్లములోనన్
చల్లగాననుబ్రోవవలెనమ్మా - యుల్లమందునదయనుజేకొమ్మా-
తల్లివినీవై - యెల్లలోకములేలినావమ్మా - శివునికొమ్మా॥ పర॥

౨. ఇందువదనరో వేగనీరూపు - జూపవెనాకు
కుందరదనవాసేదుచి- బ్రూపు - మందగమనరో నేలయికదాపు
యేవగనైన- నందముగనను జేర్చునీదాపు- రేపుమాపు॥ పర॥

౩. పంతములరగనిపుడుమరివేగా- చింతలనుబాపి
సంతతమునను బ్రోవుమరివేగా - దంతిగమనరో ధర్మవర్ధనీ
యేవంతనైన- మంతనంబునజేర్చవేచాగా- శాంతితో వేగా॥ పరమ॥

౪. క్షేమతిరుమలగిరినివాసిని- కామితవరదె రామలింగనిహృదయావాసిని
క్షేమమొసగియునన్నుగావుము - పామరుడనమ్మ
స్వామిశివునిరాణివైయికరమ్మ- వేగమేలెమ్మ॥ పర॥

అంబ ప్రార్థన.

౯= తోడిరాగం - రూపకతాళం.

ప ల్ల వి.

నీదుమహిమయేమొతోచదూ - శ్రీభవానినాకు॥ నీదు॥

అ ను ప ల్ల వి.

నీదుమహిమయేమొకాని - నిలువనియ్యదుమనసులోన
పాదుకొనెనుజగములందు - వేదవేద్యయేమిజెప్పుదు॥ నీదు



చ ర ణ ము.

౧. ఇందువదననీవువేగ - సందుసందునిండియుండ
నెందుగనగబోదునేను - కుందరదనమందహాస॥ నీదు

౨. నాదబిందుకళలనీవు - పాదుగానునుంటివనుచు
మోదమలరవింటినేను - బాధనుదొలగించికావు॥ నీదు

౩, హరిహరబ్రహ్మాదులిలను - మరియుగానరనుచుశ్రుతుల
మొరయనిన్నుగనగనితర - నరులనగానెంతవారు॥ నీదు

౪. ధరనతిరుమలాద్రివాసి - వరదరామలింగవినుతే
పరమతేజనీపదంబు - పరగనిచ్చినన్నుగావు॥ నీదు॥



౧౦= సౌరాష్ట్రరాగం- ఏకతాళం.

చూర్ణికలు.

౧. ఓమిత్యేకాక్షరం బ్రహ్మేత్యాది శృతివచనోదిత శ్రీమదోంకారాంతస్థిత - అకారఉకారమకారాత్మక- మాయాకల్పిత - సృష్టిస్థితిలయ-తిరోధానానుగ్రహ- పంచవిధ కార్యకారణరూపాభిరామం॥ శ్రీరామం భజేహం- భజేహం॥

౨. ఆదిత్యాదిసమస్తగ్రహగణ, పరిదృశ్యమానజగత్ప్రకాశం, సర్వాంతస్థితతేజోమయాభిరామం॥ శ్రీరామం భజేహం॥

౩. సకలజగజ్జేగీయమాన, జగజ్జాలజంతుసంతాన, పరంపరావిద్యాకల్పిత, మోహజాలసమన్వితేషణ త్రయాద్యంధకార, బంధుర, మదవారణ, వారణ, కంఠీరవం, ప్రకృతిపరిభవం॥ శ్రీకేశవం భజేహం॥

౪. మూలాధార స్వాధిష్ఠాన మణిపూరకానాహత విశుద్ధాజ్ఞాసహస్రార, కమలకర్ణికపరిస్థిత, సుషుమ్నాత్మక, గణపతి బ్రహ్మవిష్ణు మహేశ్వర, సదాశివగురురధిష్ఠాన, స్వరూపాభిరామం, జగదభిరామం॥ శ్రీరామం భజేహం॥

౫. ప్రాణాపానవ్యానోదానసమాన, నాగకూర్మకృకరదేవదత్తధనంజయ. వాయుమయప్రాణరూపం, శృంగాటకచతుష్పథ భ్రూకుటిమధ్యభాగస్థిత, నిరామయ, భాసమానాభిరామం॥ శ్రీరామం భజేహం॥

౬. సంసారతాపత్రయాఘోరదావాగ్నిసంతప్త పరిపీడ్యభక్తపరంపరానేక కృపాకటాక్షవీక్షణ వర్షాయమానధారాధరం॥ సుగుణసాంద్రం భజేహం॥

౭. నిరంతరాపేక్షణీయ భక్త హృదయారవింద, మరందపాన మిళిందాయమానా, నందాంబుధి, వీచికాంతస్థిత తేజోవిరాజితాభిరామం॥ శ్రీరామం భజేహం॥

౮. కార్యకారణకర్తృత్వభోక్తృత్వ, మంత్రతత్వ యంత్రతత్వ, తంత్రతత్వ నానావిధవృత్త్యారూఢాభిరామం॥ శ్రీరామం భజేహం॥



౯. ఆనందో బ్రహ్మేత్యాదిశ్రుతివచనప్రమాణోదిత, విషయానంద విద్యానంద, యోగానంద, బ్రహ్మానంద, సదానందాభిరామం॥ శ్రీరామం భజేహం॥

౧౦. అసావాదిత్యో బ్రహ్మేత్యాదిశ్రుతినిగదితాఖండానంత తేజోభిరామం॥ శ్రీరామం భజేహం॥

౧౧. అనంతకోటి బ్రహ్మాండమండలాంతస్థిత, నిత్యనిరంజననిరీహ నిర్వికల్ప నిర్వికారనిరామయ నిర్ద్వంద్వనిరవయవ నిత్యతృప్తనిరతనిశ్చల నితాంతప్రకాశాభిరామం॥ శ్రీరామం భజేహం॥

౧౨. ఏకమేవాద్వితీయం బ్రహ్మ, నేహనానాస్తికించనేత్యాది శ్రుతివచనోదిత, దేశకృతకాలకృతవస్తుకృత, స్వజాతీయవిజాతీయస్వగతభేదరహితపరతత్త్వం, కాలత్రయ లోకత్రయదేహత్రయ మూర్తిత్రయ వాసనాత్రయాది, సమస్తత్రిపుటిరహితం, శ్రీరామచంద్రం-భువనచంద్రం, భజేహం॥

౧౩. భక్తపరంపరనిరంతరానంతనామోచ్చారణ పరత్వగురుకారుణ్యావర రామలింగార్య, హృదిప్రకాశం, తిరుమలగిరినివాసం, రమేశం॥ భజేహం, భజేహం॥

౧౨. స్వరజతులు.

ముఖారిరాగం - ఆదితాళం.

పల్లవి.

రి మా ప ప ధ రి సా।
అం భో ని ధి త ర ణా।

అనుపల్లవి.

రిసనిధప । ధసరిమగరి । సరిసనిధప । మ గ రిస॥ శ్రీమా
సకలసమ। సరసహృదయ। సమతప్రకృతి । రఘువర॥ అం

౧. మాపమపా ధా। సని పధస। ధాసరి స నిధప।
సూరసమాకా। రప్రభజిత। శూరజయసురను।
ధపమాగరిస। రి సగ రి। మగప ప। ధపనిధ।
ఘనతా బ్జజవి। నుతసుమ। శరహర। సుతభవ।
సగ రిస। గ రీ సానిస ప। మధాపమగరిస॥ రిమా
భయహర। భవా నీ వినుత। భవా బ్ధితరివర॥ అం

౨. మాం గ రిగసరిమా। సారిమగరి। స రి ప మగరి।
శ్రీ ఘనితరపరమో। దారసకల। హృదయ నికట।
మమపపధధసస। రి స రిమ గ రి। స రి మగరి।
సుపధసుఖదమల। రహిత విహిత। గృహి తకర।
గ రి స నిధప। రిసనిధప। పమగ రి స॥ రిమా
కరద్యుతిజిత। శరధిసుత। కలుషహర॥ అం

౩. మగరిసరిస। ససరిసనిధ। ప దసా। రిమగరి।
సకలభువన। భవనసతత। సుసుఖా। వసితస।
రిపమమ। పమ గ రి। మాపధ। మపధప। మ పదసానిధ ప।
రసజన। ఘనహృది। కాంతిమ। సనకస। సుమనిసే వితత్రి।
పదపపా మగరి। రిసనిధపధ। పమగ రి స॥ రిమా
భువన పో షకశ। శినుతపదయు। రచిరముద॥ అం

౪. ధాపమ పదధప। దధప మపధస। మపధ రీ స ని ధప।
పంకేరుహవదన। పరమ పదధన। పరమమానిహృదయ।
మప ధస నిధ। మపద ధప। మ పద। మపధసానిధప।
పరమసుఖద। భరితభువ। న ఘన। పరసుఖారసస।
మపధరిస నిధ ప। మపధధపప। మగసరి॥ రిమా॥
దమలసదయామధు। రపరిమిళిత। సువచన॥ అంభో॥



౧౨. ఆరభిరాగం- ఆదితాళం.

పల్లవి.

దయరాదా - నరహరి॥ దయరా

అనుపల్లవి.

భయహరసురకులలలామ వాద॥ దయరా

౧. రయముమీరనను- చేరదీసినానుతులెల్లనువినుకొంచు- నీకె
నతిప్రేమతోరక్షించు- సుఖమిచ్చియుమన్నించు- ననుగాంచు॥ దయరా
౨. ముక్తినిచ్చుచుండెదవనిసేవించితినిభువి- ముదమున-బుధులచే వేగా-నీవు
రక్తిచెమరిననుగావా-మహానుభావా- నీవిటురావా॥ దయరా
౩. కడునిడుములబడిచేసితినే- కడువడిగనుబిలువనుతగవా- మకువ
నాపైలేదికతగవా- నరహరి- ఖగవాహననగవా॥ దయరా
౪. ధరధరసురమునివరనుతచరణా- సరసిజభవనుతచరణా
సురవరదసద్గుణాభరణా- కరివరకరుణాశ్రితజనభరణా॥ దయరా
౫. క్షేమతిరుమలగిరిపురివరనిలయా- రామలింగవరనుతవరదా-హరి
కామజనకనాకరుదా- పొడజూపవే- రమవరదా- యికే॥ దయరా

౧౩. ఖమాచిరాగం- ఆదితాళం.

పల్లవి.

పాలయపశుపతినుతవరదా - ఫణిపతిశయనన్నహరి॥ పాల

అనుపల్లవి.

నీలదేహపరప్రేమాస్పదగుణ. జాలసురమునిలోలరఘువర॥ పాల

చరణం.

౧. శ్రీవరహితఘన- నాదప్రమోదితవాదా- శ్రుతవేదా
బోధరూపనిగమాగమనుతవరనాథా- శ్రుతవేదా
సాధువినుతపరిసకలాంతస్థిత-బాధరహితమాంపాహిరఘువర॥ పా
౨. నిత్యనిరంజన నిర్మలనిరుపమకామా - వరధామా



సత్యసకలజనసంస్తుతివరశుభవరనామా- గుణధామా
సతతమదభీష్టదాయక- సంగరహిత- సర్వాత్మకహరిహరి॥ పాల
౩. సనకసనందనమునివర ఘనహృదిమననా- గుణగణనా
జనకజాతహృదిసారసనంస్థ ప్రీభరణా- శుభకరుణా
ప్రణవాంతస్థితపరమపరాత్పర- ప్రకృతిరహితహరిపావనచరిత॥ పా
౪. క్షేమతిరుమలగిరీశమురహరి- రామలింగవరప్రేమా-
పరప్రేమా-కామితార్థఫలదాయకభవహరనామా-రణభీమా
భూమకృపాంచిత రామచంద్రమమ - పాహిపాహి మాంపాహి
శ్రీహరే॥ పాలయ

౧౪= సురటిరాగం- ఆదితాళం.

ప ల్ల వి.

నామనవిచేకొనవదేమిసేతురా - శ్రీరామచంద్ర॥ నా

అ ను ప ల్ల వి,

శ్యామగాత్రపూర్ణహృదయ - సోమసూర్యవిరాజమాననేత్ర॥ నా

చ ర ణ ము.

౧. నతజనమతివరహితమతిదినేశా- శ్రీరామరమేశ- యీశ
సతతమదభీష్టదాయక- శ్రీవికుంఠ- నమితనీలకంఠ॥ నామన
౨. పాపవర్తనుడననిదలచితివో- కోపమార్గరతుడనిమెంచితివో
ప్రబలమోహకలితుడననినొచ్చితివో- పాపరహితనాయెడ॥ నామన
౩. మంగళకరమామకనిబిడౌఘ- సంగములనుమానిచికృపతో
లింగవినుతతిరుమలాద్రివాసుడ- సంగరహితశ్రీరామచంద్ర॥ నామన

౧౫= ఆఠాణారాగము - ఆదితాళము.

ప ల్ల వి.

సకలనిగమకారణప్రకృతిరహిత - పూర్ణానుతేజా-శ్రీరామా॥సక॥



అ ను ప ల్ల వి.

నిఖిలభువనపరివందితలక్షణ- యకళంకజగదంతర తేజ॥ సకల

౧. సంతతసకలదిగంతర పరివర్తితపరమాభా
చింతితవరయోగి జనహృదంతరభావా
నిరంతరజనహృదంచితపరిదృశ్యమానవరశోభా
అనంతకోటిబ్రహ్మాండనిలయాపరిమితసూర్యాభా॥ సకల

౨. అష్టమదవారణవారణకారణ తారకనామా
అష్టదుఃఖపరిమర్దితబిరుదాంకితసుసేమా
సృష్టపంచకోశపంచవింశతితత్వాంతరధామా
శిష్టభక్తపోషణనిరతకరుణాకరసుభనామ॥ సకల

౩. పరమపావనమునిహృదిశరజషట్కాంతర తేజా
నిరతసంసరణతరణకారణసురచిర తేజా
వరభక్తభోజ- వరదసకలబీజా- వరదతిరుమలగిరి
నిలయవర రామలింగనుత చరణసురభూజ॥ సకల॥

౧౬౩ పూరికల్యాణిరాగం - రూపకతాళం.

ప ల్ల వి.

రామచంద్ర- రాఘవేంద్ర॥ రామ

అ ను ప ల్ల వి.

కామితఫలకల్పద్రుమ - కామజనకప్రేమాస్పద॥ రామ

చ ర ణ ము.

౧. పరమపురుషుడవనినిన్ను - పరగవేడితిచాల
పరులనునేనికవేడ- పరమీశ్వర- పరమాత్మ
ధరసూనుడ- వరదీనుడ॥ రామ

౨. భవబాధలచేజిక్కి- చాల- బాధలనోపక - భవహరనీకునుమ్రొక్కి-
దినమునునిను- సవినయముగ- రవికులవర- శివనుతపద॥ రామ

౩. తిరుమలగిరివాస- స్థిరతరచిద్విలాస - వరలింగయాపోష
రమేశా- హృదివాస- జగదీశ- అఘనాశ॥ రామ

౧౭. తోడిరాగం - రూపకతాళం.

పల్లవి.

రామనామమహిమదెలియదు- అదియేమొకాని॥ రామ

అనుపల్లవి.

కామితార్థములనొసగు- నామలక్ష్మీవక్షమాణ
భూమిజనులుదెలియతరమ- నేమమెసగపరంధామ॥ రామ

చరణము.

౧. ముందుజనకజాతతోడ- చందమెరిగెవాయుసుతుడు
నందుసాంఖ్యయోగమెల్ల- పొందుదెలిసెనగవింటి రామ

౨. సకలజగములందునిండి- సరవిసూర్యకోటితేజ
మికనువెలుగుననుచుదెలిపె- ప్రకటసీతమానిలజునకు॥ రామ

౩. యిందునందునెందుజూడ- సందులేకసకలమందు
బిందురాంతరాంతసూక్ష్మ- బిందుగడచియున్నయట్టి॥ రామ

౪. భావభావభావరహిత- భావమెరిగినవలజేరి
భావనాత్మగడచితుదను- భావశూన్యమైనయట్టి। రామ

౫. రామరామయనుచునిత్య- రామపదవిగోరివేగ
రామలింగవర్యుడెలమి- క్షేమమీరదలచుచున్న॥ రామ॥

౧౮. ఆరభిరాగం - ఆదితాళం.

పల్లవి.

యేరా- యదువీర- యిది ఓహో- హారమణిమయ-
మారుబలుకవహా- యిది॥ యేరా॥

అనుపల్లవి.

కోరికనీపదకమలంబులపై- గోరియుంటినిగాద- నను
జేరదీయనయరాదా- మర్యాద- వాద యిది॥ యేరా



చరణం.

౧. వారిబుద్బుదమువంటిది దేహము - నేరకనెటునమ్మెదు దేవా-నను
బ్రోరకయమునికిచ్చేవా- వారకతగవా- హరజనక యిది॥ ఏరా

౨. ధనమిమ్మనినిన్నడిగితినా నీ- ఘనపదమొసగుటకన్నా- యిది
ఘనమాపనినీకౌనా - మనసునవెన్న- గిలవణ యిది॥ ఏరా

౩. క్షేమతిరుమలాద్రీశుడవని నే- నీమహివినియున్నారా- విని
కామించితికడతేరా- రామలింగవర- క్షేమమొసగునది॥ ఏ॥

౧౯= ఖమాచిరాగం - ఆదితాళం.

పల్లవి.

రామచంద్రాయనరా - ఓరి జీవుడ॥ రామ

అనుపల్లవి.

రామచంద్రయని రయమునసీకను - ప్రేమతోనిప్పుడు
ప్రియమునజెప్పితి॥ రామ

చరణము.

౧. యనుమా- మనమునసికసిదివినుమా- పసిబూసియు రామా
యనుమా- భవభయములుదొలగును గనుమా- ఘన తారకము
యనవరతమునునుమా- యనుమానమేల- నామనవినిగనిమరి॥ రామ

౨. కోనుమా- హరినిమదినిడికొనుమా- యెప్పుడుదాసులచేరిక
గనుమా- ఘనపదవినిగనుగొనుమా- మునుఘనులగు
సనకసనందాదుల- సుదినమునుమనమున- గనిరటనిక శ్రీ॥ రామ

౩. మతినీ- సతతముగననీగతినీ- దొలగనుగనుదుర్మతినీ
బతిమాలకుపరులనీక్షితినీ- మతిమంతులచే
హితమునుమతిగని- కుతుకముచేనీస్థితిగతిగని శ్రీ॥ రామ

౪. ధరనూ- తిరుమలగిరిస్థిరతరధారనూ- రామలింగనేలెనట
బిరబిరనూ- స్థిరమతిగనుకరిధారనూ- హరిహరియని
మరయుచు- యురమునశ్రీ- కరమున మెరయునట॥ రామ

౨౦= కీరవాణిరాగం - ఆదితాళము.

పల్లవి.

క్షీరాబ్ధిశయనరావె - నేగోరగాను॥ క్షీరా

అనుపల్లవి.

పారమునొందించనేనతి - వారవారాముబిలువ
నేరములెంచాకరావె - నేగోరగాను॥ క్షీరా

చరణము.

౧. హాకృష్ణవైకుంఠవాస - యాశదోద్ధారకయనగా
భారమైనబాపిగావావ - నావెతదీరను॥ క్షీరా
౨. కరిమకరిచేతజిక్కి - మొరనుసేయనపుడువేగ
బిరబిరను - యురికిరావా - నాకరినిబ్రోవ॥ క్షీరా
౩. కటకటదనుజవిభుడు - కరుణలేకబాధించగా
ధిటవుతోప్రహలాదువేడగా - తటుకూనరావా॥ క్షీరా
౪. ధరనుతిరుమలాద్రివాస - దాసరామలింగపోష
స్థిరతరచిద్విలాస - పరమోల్లాస॥ క్షీరా॥

౨౧= దర్బారురాగం - ఆదితాళం.

పల్లవి.

నారసింహరారా - శ్రీహరి - నావెతలనుమరిగనరా - వినరా॥ నార

అనుపల్లవి.

కారణమూర్తివి - కరుణతోనిప్పుడు
నేరములెన్నక - చేరగనీవిటు॥ నార

చరణము.

౧. దేవదేవవినుతా - నరహరి - కావవేయిదిఘనతా - వినుతా
భావభావసుభావితశుభకర - రావవేమరినను - బ్రోవనువేగమె॥ నార

౨. కందునిన్నుచురియూ- కేశవ- డెందమందుమరియూ- సరియూ
కుందరదన శ్రీ-ముకుందమాధవ- సంచేహించకసరగుననీవిటు॥ నార
౩. పరమపురుషయరుదా- శ్రీధర- కరమరుదుగబిరుదా- వరదా
పరమపావన- పరాకుశేయక- వరములొసగుటకు బిరబిరనీవిటు॥నా
౪. క్షేత్రతిరుమలాద్రి- అచ్యుత- ధాముడవనిమదినీ- వ్యాదినీ
కామజనకనను- కరుణతోజూచియు- వేమరుగావవె
రామలింగనుత॥ నార॥

౨౨= పార్సీమెట్టు, బ్యాంచురాగం - ఏకతాళం.

పల్లవి.

మురారి బ్రోవవేమిర॥ ము॥

అనుపల్లవి.

పరమపురుష - వరదనను॥ ము

చరణము.

౧. గరుడగౌతువని- మురయే- మదుంగుదువరముల
బరిపి- నిరతమిటుల- నను॥ ము
౨. నేలుకునవయ్యా- నైనానుయీవేళ నేవీడనయ్యా
పలువేళ గాదయ్యా- నీసేవవిడనయ్యా
మందూడ- మూఢూడ- నెందాకసైతు॥ ము
౩. కరుణాబ్ధిలింగానిమొరవినుమీ - శేనపురివాసనను బ్రోవ
తరుగేమిలేదయ్యా - హా- హా- హా- హా
కరుగదమనసును- వెరపునబడితిని- హరిహరియులసితి
మొరవిను శ్రీ॥ ము

౨౩= జంఝూటిరాగం - అటతాళం.

పల్లవి.

పాహి శ్రీరామా - పావననామ॥ పాహి



అనుపల్లవి.

దేహియనుచునిన్నే - దేవానికవేడితి॥ పాహి

చరణము.

౧. సనకాదివరనుత - సానందమునినుత॥ పాహి
౨. హృదయకమలవాస - సదయచిద్విలాస॥ పాహి
౩. కామసంహరుమిత్ర - భూమిజావరపాత్ర॥ పాహి
౪. వరదత్రికుటవాస - పరమహృదోల్లాస॥ పాహి
౫. చింతనామృతనామ - మంతనాంతరధామ॥ పాహి
౬. వరముక్తికరపాద - ధరనుతశ్రుతవేదా॥ పాహి
౭. పరమపావనధీర - పాపసంహారశూర॥ పాహి
౮. ధరతిరుమలాద్రీశ - వరలింగహృదివాస॥ పాహి॥

౨౪. ద్రామామెట్టు - ఏకతాళం.

పల్లవి.

శ్రీసీతామనోహర - హితాకర॥ శ్రీసీతా

అనుపల్లవి.

హతాసురా - భాసితాంగపరపృథ్వీకాశయీశనామొరా
వా- సూ- దే- వా- శ్రీశవినరా॥ శ్రీసీతా

చరణము.

౧. రామచంద్రరాఘవేంద్రరారా - సందేమిరా
కామజితశరీరమనసు - కరుగదేమిరా
రా- మా- నా- క్షూ- క్షేమమొసగరా॥ శ్రీసీతా
౨. మందహాససుందరవదనరారా - యిందేమిరా
యిందిరహృదయారవింద - మిళిందసుందరా
యిం- దూ- రా- ప్రూ- అందమేమిరా॥ శ్రీసీతా



3. కుండలీంద్రశయనగావరారా - అండేమిరా
మండలప్రకాశకోటి - చండభాస్కరా
అం- డా- జే- రీ- యుండుశ్రీపతి॥ శ్రీసీతా

౪. క్షేమతిరుమలాద్రివాసయీశా - మరేమిరా
రామలింగవరదప్రేమ - క్షేమశ్రీకదా
సే- మా- మే- మీ- రామరఘువర॥ శ్రీసీతా॥

## ఏకాదశిమహాత్మ్యము.

౨౫= నాదనామక్రియరాగం- ఆదితాళము.

పల్లవి.

యేకాదశివ్రతమేమనిదెల్పుదు - యేకాంతమెగద॥ యే॥

అనుపల్లవి.

ప్రాకటయశమును - బరగనిచ్చునదె- పరమపదమెగద॥ యే

చరణము.

౧. ప్రకృతిగుణములు- పరగబాపినది- యకళంకమెగద॥ యే
సకలశాస్త్రములసన్నుతిజెందిన - ప్రకటవ్రతమెగద॥ యే
౨. సర్వవేదముల- సారముదెలిపిన- సరసపదమెగద॥ యే
సర్వాత్ముని మదినిత్యముదలచియు - సారమెరుగునదె॥ యే
3. రామకృష్ణగోవిందాయనుచును - రాతిరిగడపిన॥ యే
కామక్రోధములుగలుగకనిరతము - గాచియుండునని॥ దేకా
౪. నిత్యముమరువకనిజహృదియందున- సత్యమునిల్పిన॥ దేకా
మర్త్యముదాసియు - సత్యపదవిని- నిత్యమెరుగుటే॥ కాదసి
౫. నాదబిందుకళలను దెలిసియు- వాదముదీరుటే॥ కాదసి
సాధులసేవయు జేసియు మదిలో- భేదముబాయుటే॥ కాదసి



౬. బంధమోక్షములభ్రాంతులరెంటిని - బాపుకున్న దే॥ కాద
యెందునజూచిన - నందుననిండియు- ముందున కెల్లను దే॥ కాదసి
౭. క్షేమతిరుమలగిరీశునిలచిన - ప్రేమపదవిగద॥ యే
రామలింగమురయమునసిత్యము - కామించునదే॥ కాదశి॥

## మంగళహారతి.

౨౬= కాంభోది రాగం - అట తాళం.

పల్లవి.

హారతిశ్రీరామ - అనులశుభదనామ-
హారతిపరంధామ-శ్రీరామ॥ హారతి

అనుపల్లవి.

హారతిదుగో పరమపావన- యఖిలసురమునివినుతశ్రీహరి
ధీరవరపరమాత్మగిరిధర- చారుసుందరమారజనక॥ హార

౧. పతితపావనవరద- హితభక్తమందార- శ్రితమానిహృదిదీపా
సతతమునన్ను- సవరించుమరితేపా- కుతుకమొదవగగావువేగమె
కుండలీంద్రపర్యంకశయన- అతులితంబుగనిన్నువేడితి
శ్రితజనార్ధన రామరాఘవ॥ హార

౨. శరధిబంధనశ్రీ- పరమకల్యాణపో- శరచాపధరధీరా- కరుణచెగావు
కరివరదకరుణాకర- యూర్ధ్వధరధరపరమశుభకర- సర్వసురవిహార
భూవర-సర్వవందితవిజయరాఘవ-శరణుశ్రీపరమేశరఘువర॥ హార

౩. మందహాసగోవిందమాధవశ్రీ - సుందరశుభగాత్ర
వందితసుజన- బృందసురమునిపాత్రా- కుందకుట్మల
రదనసర - విందనయనము- కుందశ్రీధవ- నందనంద
పురందరాదిసుర- బృందనుతపదద్వంద్వశ్రీహరి॥ హార

౪. క్షేమతిరుమలగిరి- ధామసజ్జననుత- రామతారకనామ



ప్రేమతో బ్రోవు- నేమకలుషవిరామా- రామరాఘవ
రవికులాన్వయ- సోమభీమపరాక్రమవిక్రమ
రామలింగవినుతసుగుణ- స్తోమభార్గవరామనామా॥ హారతి

## మంగళహారతి.

### ౨౭. కల్యాణిరాగం - అటతాళం.

పల్లవి.

మంగళమిదుగో శ్రీరామా- సర్వమంగళవినుతశుభనామా॥ మం

అనుపల్లవి.

సంగరాంగణసమరవిజయశు- భాంగదనుజవి- భంగశుభగుణ
అంగజితసారంగసుందర- రంగనాథదయాంతరంగ॥ మం

చరణము.

౧. పాపనాశనభక్తపోషణా- ఘన- తాపనాశనయుక్తభాషణా
కాపటాదిదనుజమర్దన- కరుణసాగర- కారణాత్మక
పాపరాడ్పర్యంకశయన- చాపభంగశుభాంగసురనుత॥ మంగ
౨. యిందీవరశ్యామగాత్రా- శర- దిందీవరశుభనేత్రా
యిందిరాహృదయారవిందమరందపానమిళిందసుందర
వందితామరబృంద నానందకంద ముకుందమాధవ॥ మంగ
౩. వరదాసుందరశుభవేషా- నన్ను- యరుదా బ్రోచుటజగధీశా
బిరుదుయిదెనాకరిని బ్రోచిన- పరపావననీదుమనసు
కరుగకున్నది- మరచియుంటివ- శరధిసుతలక్ష్మీశగిరిధర॥ మంగ
౪. క్షేమతిరుమలగిరిధామా- వర- రామలింగవినుతకామా
కామితార్థప్రదాతవిభవ- కామజనకనన్ను వేగమె
క్షేమమొసగియునికను గావుము- రామరాఘవప్రేమతోడ॥ మంగ



## మంగళహారతి.

౨౦= సురటరాగం - అటతాళము.

పల్లవి.

మంగళంమంగళం- శ్రీరఘురామా- మంగళంమంగళం॥

అనుపల్లవి.

మంగాళమంగజభంగవినుతపాద- మంగళాలయహృదయ
మంత్రరూప- సంగసజ్జనయంత- రంగయోగిజన - మంగళా
కరదేహ- మహానియ్యాగుణరంగా॥ మంగ

చరణము.

౧. తారకనామమై- సారపరిపూర్ణమై- వారిజాసనాదివరస్తోత్రమై
నారదాదియోగినయవినుతమైనట్టి- దహరమధ్యంబున
గోరియున్నతండ్రీ॥ మంగ

౨. ఆదిమధ్యాంతమై- యమనస్కయోగమై- నాదుబిందుకళల
నాదాంతమై- వేదాంతవేద్యమై- వేదగోచరమునై
ఆదికనాదిరై- యఖండమైనతండ్రీ॥ మంగ

౩. మూటిమూటినిమించి- మూటికవ్వలజేరి- మూటిలోపలమరి
మొనయమణిగి- మూటిదాటి- త్రికూటమధ్యంబున
పాటివెల్గుననున్న- మేటిరైనతండ్రీ॥ మంగ

౪. కంటిపాపనంటి- రెంటివెంటనరిగి- మింటికేగినచట
యొంటిజేరి- మంటమింటికిచాల- జంటనైనలో
కంటిలోపలనున్న - యొంటివెల్గుతండ్రీ॥ మంగ

౫. ఆరురూపములయ్యే- నారుపుష్పలనడుమ
నారుకోనియమరి - నారుజేరి - నారునొకటిగూడె
నారారుమరిపి?- కోరికతోనున్న - శ్రీహరిరఘురామ॥ మంగ



౬. చూపులోచూపునై- చూపురూపులునై- చూపురూపులసందు
చోద్యంబునై- చూపురూపులసందు చోద్యమెరిగినయంత
ఆపజ్యోతిమై- అరయనున్నతండ్రీ॥ మంగ

౭. సకలంబునీవైమై- అకలంకమూర్తివై- వికలంబులేకమరివిమలంబునై
భ్రుకుటిమధ్యంబున- భూమరూపంబయ్యు- అకుటిలతేజమై
యాత్మనైమైనతండ్రీ॥ మంగ

౮. క్షేమతిరుమలగిరి- ధామనిర్మలభక్త- కామమంజులభాష
నేమాభిషా - రామలింగవినుత- రాజీవదళనేత్ర
రామరామరామశ్రీరామవరనామ॥ మంగ॥

## మంగళహారతి.

రాగ= బిలహరిరాగం- ఆదితాళం.

### పల్లవి.

మంగళహారతిదేరే- అంగుతోమన- మంగళాంగునకు॥ మంగ

### అనుపల్లవి.

మంగళాలయవినుతునకు- అంగనామణులెల్లగూడి
పొంగుచు శ్రీరామునకు॥ మంగ

### చరణము.

౧. ప్రణవమయరూపునకు- పరమార్థప్రదదీపునకు
ప్రణవాంతరపరితేజునకు- ప్రణవతీతుడైనశ్రీఘనుడౌ
రామపదునాకు॥ మంగ

౨. అండపిండనిలయునకు- బ్రహ్మాండభాండనిలయునకూ
కుండలీంద్రశయనునకు- దండితేజుడైనయా
ఖండత్రయమండలునకు॥ మంగ

౩. భృకుటిమధ్యవాసునకు- ప్రకృతిరహితతేజునకు
సకలవికృతిదూరునకు- అకుటిలమతిమైన
ప్రకటహిత తేజునకు॥ మంగ



౪. వేదవేద్యపాదునకు- వేదసమ్మతపూజ్యునకు
నాదదశకమోదునకు - నాదాతీతుఁడైనభక్త
హృదయవనజవాసునకు॥

౫. క్షేమతిర్మల్‌గిరీశునకు- రామలింగపోషునకు
కామితార్థవరదునకు- కామక్రోధరహితుఁడయిన
రామపదవాచ్యునకు॥ మంగ

దశావతారముల మంగళం.

౩౦= ఆనందభైరవిరాగం - అటతాళం.

పల్లవి.

మంగాళమిదుగో శ్రీహరి- శ్రీధరసకు- మంగాళమిదుగో శ్రీహరి॥ మం

అనుపల్లవి.

మంగాళమిదుగో శ్రీమాధవగోవింద- అంగాజసుందర
మంగళాలయానుత- మంగళాంగసుభక్తమానస- సంగహృ
త్సారంగరంగ- రంగనాథదయాంతరంగను- తుంగ- సంగత
విజయజయజయ॥ మంగ

చరణము.

౧. మచ్ఛావతారమహనీయ్యా- శ్రీకేశవ- స్వచ్ఛహృదయపావనా
పక్షీంద్రగమనవో- నక్షీణ విక్రమ యక్షేంద్రసఖినుత
లక్ష్మీనాథదేవ- మత్స్యమైయాయుదధిజొచ్చియు
దెచ్చి వేదములపుడు- బ్రహ్మకు- నిచ్చిమరియును- కొండవీపున
సచ్ఛముగధరియించితివు॥ మంగ

౨. వరహరూపధరదేవా- నారాయణ- కరివరదకారణభావ
సురమునిసేవిత - కరకరద్యుతితేజ మురదమన - నరనుత
ధరధర శ్రీకర - వరహమైయాహిరణ్యాక్షుని- సరగజంపితి
ధరను మెచ్చగ- అరుదుమీరగసతసితమ్ముని- నరహరియునై
వనితులబ్రోచితివు॥ మంగ



౩. వామనరూపశ్రీదేవా- త్రివిక్రమ- క్షేమసుదామోదర
ధామవరవైకుంఠ- నేమశ్రీవల్లాభ- కామితఫలదాయ
కరుణాశింధురూప- క్షేమతోడనుసురలను గావను
క్షేమవటురూపంబునొందియు- కామమెసగబలిని
పదత్రయు- భూమిభిక్షమునడిగితీవు॥ మంగ

౪. రామరామరామనామ - రాజీవాక్ష- రామతారకనామ
రామరాజకుల- భీమగర్వాపహ- రామదశరథసుత
రావణమర్దన- క్షేమకరపరమాత్మకరివర -కామశ్రీబలరామదేవ
శ్రీమనోహరరామరాఘవ-రఘుకులాన్వయసింధుసోమ॥ మంగ

౫. పరమకళ్యాణశ్రీకర- దేవదేవ- వరదనన్నుగావర- ధరతిర్మల్గిరి
వాసధర్మస్వరూపవో- స్థిరబుద్ధికలిదమన- చిద్విలాసయీశ
వరదయాసముద్రభద్ర- పరమపావనభక్తశుభకర
ద్వరదపోషణదీనరక్షణ- నరయలింగవినుతభవహర॥ మంగ

మంగళహారతి.

౩౧= సావేరిరాగం - ఆదితాళం.

పల్లవి.

మంగళంరామచంద్రతే- రవివంశచంద్ర॥ మంగ

అనుపల్లవి.

మంగళంరామచంద్ర - మహాప్రభావసుగుణసాంద్ర
రంగనాథదనుజభంగ- సంగరాదివిజయజయసు॥ మంగ

చరణము.

౧. శరధితరణ- పరమపావన- శ్రీరాఘవేంద్ర
శరణభక్తవరదపాలన- వరదయాసముద్ర



భద్రశరశరాసనాదిధరిత- వరదరాజరాజ
చంద్ర- పరప్రకాశ భవవినాశ॥

౨. నారదాదివినుతపాదతే- శ్రీరామచంద్ర
శారదాభ్రనీలదేహతే- కారణాత్మకరుణశింధో
మేరుధీరదనుజమార- సారసాక్షశూరవీర
మారజనక చారువేష॥ మంగ

౩. యిందువదనసుందరాంగతే- శ్రీరాఘవాయ
కుందరదనమాధవాయతే - మందమంద
హాసనుమన- బృందకందచందనాయ
శింధుబంధనాయసుజన - వందనాయభవతుతే॥ మంగ

౪. క్షేమతిరుమలాద్రివాసతే- శ్రీసీతరామ
రామలింగదాసవరదతే- కామితార్థదాత
శుభద- ప్రేమనామశ్యామగాత్ర- రామసుఖద
భవవిరామ- నేమసుగుణధామభీమ॥ మంగ॥

శ్రీరామార్పణమస్తు.







శ్రీ రస్తు.



శ్రీ పార్వతీపరమేశ్వరాయనమః.



రామకీర్తనమోస్తరు స్వరం:

3వ= స్వరజతులు.

ముఖారిరాగం - ఆదితాళం.

పల్లవి.

శంభో భవహరణా - శుభదపద - సుఖదహృదయా
సామునిప్రణుత- వరనుత॥ శంభో



అనుపల్లవి.

౧. ధీరవృషభాధార-శుభకర-శూరజయకరిముఖ-పితార్థిజన-నుతసుర-వర
హరిసుత-హార-ధృతకర-భవానీతనుజ-భవాబ్ధితరివర॥ శం. భో

౨. దీర్ఘతరపరశో- భాసురసమ- జటిలమకుట- ధనదస- ఖసుమతి
మహిమసహిత- మహితసుక- రధృతఢమర - వరరజిత- గిరిసదన॥ శం

౩. మదనమథన- మహయుతదను- జముఖా- పళ్లదళ- తపురద- హానవిధు
కాంతిము- వదనక-మలపదయుగళ- విషయదూరకర- విషమశనగ-
విరచితముద॥ శంభో

౪. గంభీరసువచన- గగనసదృశఖ- గపతివాహనసఖ- గణనుతపద-
గజదనుజ-మదన-గురుకృపాకసజ- లధిసముదురధిగ- మపథసుగమ
విషహర॥ శంభో

౩౩ ధీరశంకరాభరణరాగం - రూపకతాళం.

పల్లవి.

నిన్నుగనగతరమా- సాంబా॥ నిన్ను

అనుపల్లవి.

మిన్నుకేశ- నాశ్రితపోషక॥ నిన్ను

చరణము.

౧. క్రన్ననదయతో- నన్నునురక్షించు॥ నిన్ను

౨. పాండురాకార- యాపురహర॥ నిన్ను

౩. పిన్ననుచును మాటికి- మొన్నబోకునా నాటికి॥ నిన్ను

౪. పాతకుడను- ఘాలసుడను- కాతరుడను- కపటాత్ముడనైనే॥ నిన్ను

౫. పతితుడ- పాక్రుడ- పతిలోభుడ- అతిచారిని-
మతిహీనుడ- క్షుద్రినికనే॥ నిన్ను

౬. క్రూరాచారుడను- కుజనసంగుడను- పారరహితభవ
సారసీరధిమగ్నుడను- సారహీనమముకారిని- కుపితమతిని
వ్యభిచారిని-విరసుడ- దుర్మార్గుడ- వికృతుండ- నజ్ఞుడనే॥ నిన్ను



౭. నిర్గుణుడవు- నిర్మలుడవు- పరుడైశుభకరుడై- పరాత్పరతరుడవునై
సకలవిభవైశ్వర్యప్రదుడవై- సురాసురార్చితపద- శరజవిమలయుగివై
జరామరణరహిత- పరమకృపివై- నరయగనున్న॥ నిన్నె

౮. శ్రీపతి- శశిపతి- గణపతి- ధనపతి- అహఃపతి- అమరపతి- యతిపతి
గోపతి- రేపతి- గిరిపతి- సమితి- నిరతముభక్తితోడ- పురహర
నిన్నుగొనియాడ- మరువజాలకనువీడ- వురగధర- పసివాడ॥ నిన్నె

౯. ఖండఖండ- బ్రహ్మాండ- భాండముల- నిండియుండఖండ
తేజువగు॥ నిన్నె

౧౦. యోగభోగ- యోగ- రాగవిరాగ- యోగిమకుట॥ నిన్నె

౧౧. క్షేమతిరుమలాద్రివాస - ప్రేమరామలింగపోష॥ నిన్నె

## ధ్యానచూర్ణిక.

౩౪= సౌరాష్ట్రరాగం- ఏకతాళం.

౧. ఓంమిత్యేకాక్షరం బ్రహ్మేతిశ్రుతివచనోదిత - శ్రీమదోంకారాంతస్థిత
అకార-ఉకార- మకార మాత్రత్రయోపాధి మాయాకృతసృష్టి
స్థితిలయతిరోధానానుగ్రహ- పంచకార్యకారణ - పరమకల్యాణ
శరచ్చంద్రచంద్రికానేక- ధవళధావళ్యమాన శుద్ధస్ఫటికసంకాశ
నిర్మలస్వరూపం-మునిహృదిదీపం- శివనీలకంఠం- భవభయలుంఠం
భజేహం- భజేహం-భజేహం॥

౨. ఏకోరుద్రోనతుద్వితియ్యాయతస్థే - ఇతిశ్రుతినిగదితవచనప్రమాణ
పూర్వక- సకలచరాచరభూతభౌతిక - సర్వశరీర-బాహ్యాభ్యంతర-
పరమాకాశవత్పరిదృశ్యమాన - పరమప్రకాశతేజోమయవిరాజ
మానస్వరూపం- జగద్దీపం- శివనీలకంఠం- భవభయలుంఠం॥ భజే

౩. తస్యాశ్శిఖాయామధ్యే- పరమాత్మావ్యవస్థితస్సబ్రహ్మ ఇతిశ్రుతివచన
ప్రమాణపూర్వక-బ్రహ్మ-విష్ణురుద్ర-యింద్ర-వరుణ-కుబేర-ఈశానాది



సమస్తదేవగణ-మునిగణ-యక్షగణ-పక్షిగణాదిస్వరూపం-జగద్దీపం
శివనీలకంఠం- భవభయలుంఠం- భజేహం॥ భజేహం॥

౪. తత్స్రష్ట్వా-తదేవప్రావిశదనేన శృతివచనప్రమాణపూర్వక-సకల
జెగజ్జేగీయమాన- జంతుసంతానానేక- హృదయకర్ణికాంతస్థిత
పరమతేజోవిరాజమానప్రకాశం- భువనప్రకాశం-జగదీశం॥ భజే॥

౫. మూలాధారాదిషట్చక్రమలతదధిష్ఠాన- గణపతి- బ్రహ్మవిష్ణు- రుద్ర
శివ-సదాశివ-గురురిత్యాది-ఏకాదశేంద్రియతదధిష్ఠాన సూర్యేంద్రాది
దేవతాంతస్థిత-ఘనప్రకాశం-శివశివమీశం-భజేహం॥ భజే

౬. మాయినంతుమహేశ్వరం ఇతిశృతివచనోదిత- స్వమాయాకల్పిత
అన్నమయ-ప్రాణమయ-మనోమయ,విజ్ఞానమయ,ఆనందమయ, పంచ
కోశాంతస్థితపరమకల్యాణసుదీపం, జగద్దీపం,భజేహం॥ భజే॥

౭. అణోరణీయ్యాన్మహతోమహీయ్యా నితిశృతివచన ప్రమాణపూర్వక
స్థావరజంగమసమస్తజంతురంతరాయమాన పరివర్తితస్థూల
సూక్ష్మత్వేన,మహాప్రకాశం, జగదీశం,భజేహం॥ భజే॥

౮. ఉమాసహాయం,పరమేశ్వరం ప్రభురితిస్మృతివచన ప్రమాణపూర్వక
సమస్త,దేవగణ,ఋషిగణ,ప్రమథగణ, పతత్రిగణ,కిన్నర, కింపురుష
సిద్ధచారణ,శక్తి,భక్త గణేత్యాది పరిశేవ్యమాన, ఓంకారపదపీఠస్థిత
శుద్ధస్ఫటికసంకాశానంత సూర్యకోటి, భాసమాన శ్రీనీలకంఠం,
భవభయలుంఠం,భజేహం॥ భజే

౯. నిరాకారం నిరాకారమితి శృతినిగదితపూర్వక, దేశకృత, కాలకృత
వస్తుకృత,పరిచ్ఛేదరహిత స్వజాతియ్య విజాతియ్య స్వగతభేదరహిత
నిర్గుణ,నిరామయ,నిరీహ, నిరాకార, నిర్మల, నిశ్చల,నితాంత
నిరవయవ,కర్తృత్వ,భోక్తృత్వ,మంత్రత్వ,యంత్రత్వ,తంత్రత్వ
భోగత్వ-యోగత్వేత్యాది సకలభేదరహిత, ఏకరూపత్వేన- శృతమే



వభాంత మనుభాతిసర్వమితి శృతివచనోదిత స్వప్రకాశం
పరమేశం, ఉమేశం, భజేహం॥ భజే

౧౦. సర్వకాల సర్వావస్థ నిరంతర పరిసేవ్యమాన భక్త పరంపర తవ నామోచ్చారణ పరత్వ గురుకారుణ్య దాసదాస వరరామలింగార్య హృదిప్రకాశం. భువనేశం. శివనీలకంఠం, భవభయలుంఠం, భజేహం, భజేహం॥ భజేహం॥

౩౯= శుద్ధకాంభోజిరాగం - ఆదితాళం.

పల్లవి.

నను పాలించవదేలరా- యీశా మహేశా॥ నను

అనుపల్లవి.

ఘనమా- తిర్మలాద్రి- ఫణికులాభరణా॥ నను

చరణము.

౧. రారా- మేరా- ధీరా- వీరా- సత్సారయుక్త॥ నను

౨. వరదా- వేమరుదానీ- బిరుదానీ- మరుగూనా- కరుదాప-ధరణానీ
శరణనంగ- మరుపోయె నీకు- నిరతం జేసీ- పరమానించ॥ నను

౩. పలుకుల్- కులుకుల్- నోలుకక్- పొలుపారగను॥ నను

౪. ఘనునామీద- దయనీ- పాదములునా- హృదయవనజామోనమున
ననయము-మనమున- గనినందుకు- దినమును నీఘనసారణచే॥ నను

౫. దివాకరాది- ఘూవాళినుత- వివాదేలనాడు- భవాపహరమే
కారణమునగలుగజేతు- రాకేందు-మకుట- ప్రాంకటఘనయశ॥ నను

౬. శివ ముదమున ననుగావక్- భవకరయిలునికపోవక్
సవినయము గనీ శేవక్- యవిరళముగ నేజేయక్- రవిగతమై
కవినుతమై-భువిమతమై- దివినుతమై- భవా- దిశల- యవారితప్ర
ప్రవాహానిభ- శివాభిధము- నివేసింపగని- సువాప్తిజెంద॥ నను

36= అఠాణారాగం - ఆదితాళం.

పల్లవి.

ఫణిపభరణ వారణవసన వదనపూర్ణశశాంకా- శ్రీసాంబా॥ ఫణి

అనుపల్లవి.

ఘనసవనహరణ- భువినుతచరణా- మనసిజవిదళన॥ ఫణి

చరణము.

౧. సుగుణపాత్రపవిత్ర భసితగాత్రపాలనేత్ర- నగణితముని
సేవితపదపారిజాత- త్రిపురాసురజైత్ర- సురమునిపాత్ర
చారుసుందరశుభ్రగాత్ర- త్రిగుణస్వరూప గిరిరాజతనయ
హృత్పాత్ర-గగనశిరః-శివ కరుణపాత్ర॥ ఫణి

౨. కారణాత్మకరుణసింధో- పరమశివపరమాత్మ
ధీరవర సురగరుడోరగ సమస్తనరమృగరంతరాత్మ
పదప్రేమయుత స్థిరతరపరిధృత సర్వాత్మ
సురకులకామ-వరగిరిజహృదినిలయా-హరహర త్రిభువనకారణాత్మ॥ ఫ

3. వరరాజరాజేశ్వర పాహిమాం కృపాసముద్రా- శివశివ
ధీరమకుటపరిధృత- నిశికరశోభిత వరముద్రా
సారసాదకరసువిచార. మునిజనహృదిముద్ర
శూరతిరుమలాద్రినిలయ పరమభద్ర- ధర రామలింగనుతరుద్ర॥ ఫణి॥

37= సౌటకురంజిరాగం - ఆదితాళం.

పల్లవి.

శ్రీపార్వతీరమణా- ఫణిభరణ- పురహరణ॥ శ్రీపా

అనుపల్లవి.

భూపాదిపాలతపనాభసురరాజ- పూజితపదవిభుదసమాజ
పాపాదివారణ- గోపతివాహన శివ॥ శ్రీపా



౧. హరహరసురరాజికసముదయ - పూజితపదకమలను
చంద్రమకుట-మురహరవినుత మునిపూజిత పద
సరసీరుహాభవ॥ శ్రీపా

౨. నాదమోదవేదదీప- సాధునుతయీశ-ఛేదరహిత శ్రీగిరిజనాథ
సదయచిత్త-సముంచితనాది బోధరామలింగవరద॥ శ్రీపా

౩౮= తోడిరాగం - ఆదితాళం.

పల్లవి.

మేటినీసరిదైవతము- సురకులసంసేవిత॥ మేటి

అనుపల్లవి.

కోరినీపదదరి- జేరికృపగన- మీరివేడెదిం- దరిసుందరవర
నీరజాక్ష-ప్రముఖాదివినుత-శ్రీఉమాహృదయ- శ్రితభూపాలక॥ మేటి

చరణము.

౧. సురనరవరదన- న్నరమర జేయక- వరపురందరవినుత-త్రియక్షశివశ్రీ
నరసఖామరార్చితసుసుందర- పురహరప్రణవసునాదవినోద॥ మేటి

౨. ఇందుధరసుమునిబృందవరదసుర- బృందసేవితపద- సుంగరాంగనే
నెందుగనగభావింతు- దేవతా- నందకందముక్త- బృందవందన॥ మేటి

౩. శూరధీరనే- డునునీపదములజేరమేర- వారధిశరాసననీ
సరివారలగన శ్రీకుమారఘనాఘదూరయా, మారదమనవర॥ మేటి

౪. ధరతిమమలను-న్నగాదివాసిత-తర మెనిన్నుబొగడసురార్చితశివ
నిరుపమానదేహ- దేవగోపతివహ-రామలింగదాసవందితభవ॥ మేటి

౩౯= భైరవిరాగం - రూపకతాళం.

పల్లవి.

అఘదూర, నగధీర॥ అఘ

అనుపల్లవి.

జాగా- యోగవిహార॥ అఘ



చరణం.

౧. భగనేత్రతనువినాశ- భృంగీశ్వరసేవిత॥ అఘ

౨. కామితఫలదాయకశ్రీ- హైమవతీనాయకశివ
భూమిజాపతివినుత- రామలింగసన్నుత॥ అఘ

౪౦ = కల్యాణిరాగం - అటతాళం.

పల్లవి.

యేమిసేయుదు నన్నెవరాదరింతురు- యేమనందును సాంబా॥ యే

అనుపల్లవి.

సామినిన్నెస్మరణ జేసియు చాల- ప్రేమవేడినగాని ప్రియమించవై శివ
కామసంహార- కరుణావారధి- భీమవిక్రమ త్రిపురహరవర
కామితార్థప్రదాతశుభకర- క్షేమమొసగియు నన్నుగావవె॥ యేమి

చరణము.

౧. యేలయీలీలనన్నెమారియుండుట- యేలపరాకేలరా
కాలాయుత- జాలనటనసీలా- మేలుదెలియక నీపాలబడితినిక
కాళిప్రమదలోల- నాళీకజనుతహో- నీలపరమకృపాలసురముని
బాలఫాలశశాంకధరవర- ఫాలలోచన- కాలదానవ
భీలసుగుణాలవాల యేల॥ యే

౨. చాపకుధరవర- పాపనాశనభక్త- తాపసవరదీపా
తాపముబాపి-తరియింపనను తేపా- పాపరాడ్వరవినుత
పరమకల్యాణహో- కాపాడిరక్షించు- కరుణాచేనీరూపు
చూపరాదురనీదుమోము సుందరాంగనికను వేగమె
బాపురేయిదియెంతపనినీ- వోపలేవుయించుకైనను॥ యేమి

౩. ఆధారాదికమల నాధారరూపహో- యాదిపరమదీపా
అతులరూప- అఘరహితచిద్రూప- ఆదిమధ్యాంతర
నాదిప్రణవరూప- వాదాదగోచర- వరమునివినుతశ్రీ



నాదమోదవిలాససుందర- వేదకాయసుభక్తసుభద
వేదగోచరరామలింగవినుత- తిర్మల్గిరీశయీశా॥ యేమి॥

౪౧ = శహానరాగం - ఆదితాళం.

పల్లవి.

సాంబశరభనీదయా- సరగరాదజేమయా॥ సాంబ

అనుపల్లవి.

శంబరాసురారిదమన- అంబాసహ- శంభోయనిహృ
దంబుజముననిను నమ్మితి॥ సాంబ

చరణము.

౧. వృషభరాజవాహన- భసితదేహపావన- మిషయెందుకు
పశుపతివో- శశిభూషణ- విషమాశన-కనిబ్రోవను
పసివాడను॥ సాంబ

౨. వేదవినుతగావరా- వాదమేలబ్రోవరా- యేదేవునినేవేడను
నాదామృతమోదామృతపాదా సురబాధామలవేదాహృది॥ సాంబ

౩. భృకుటిమధ్యనిలయనీ- వికసునన్నునేలుమీ- ప్రకటాత్మక
నామది-వికలంబులు-సకలంబును- ప్రకటంబుగనికబాపుము॥ సాంబ

౪. క్షేమతిరుమలాద్రిశివ- ప్రేమచేతబిలువగా- రామలింగవరదరఘు
రామానుత- కామా- రణభీమా- సువినేమామర॥ సాంబ

౪౨ = పంతువరాళిరాగం - రూపకతాళం.

కమాచిరాగమయిననుగానముచేయవచ్చును.

పల్లవి.

నిన్నుమరచియుండజాలను- శ్రీనీలకంఠ॥ నిన్ను

అనుపల్లవి.

నిన్నుమరచియుండజాల- నీరజాక్షునన్నుబ్రోవు



సన్నుతాంగ సదయహృదయ- నన్ను గావ కరుణ రాదా॥ నిన్ను

చరణము.

౧. అన్న నిన్ను మరువ కెప్పుడు- మెన్ని గతుల వేడినాను
పన్నగారిగమనవినుత- తిన్నదనము- ఘనము- వినుము॥ నిన్ను
౨. పాపనాశ పరమపురుష- కోపశమన- కుపితదమన
దీపభువనశశికలాప- చాపకధర శ్రీపవినుత॥ నిన్ను
౩. రారపరమపావనాత్మ- రారనన్ను బ్రోవగావ
రారనిరతనిర్మలాత్మ- వీర- ధీర- పురవి- మార॥ నిన్ను
౪. క్షేమతిరుమలాద్రివాస- భీమరామలింగపోష
కామితార్థవరదభాస- ధామచిద్విలాసయీశ॥ నిన్ను

౪౩. కమాచిరాగం - ఆదితాళం.

పల్లవి.

నేలరరఘుపతినుతవరదా- నవరజితగిరిసిలయనా॥ నేలర

అనుపల్లవి.

నీలకంఠ నీపాలబడితినిక- జాలము సేయకు- ఫాలనేత్రన॥ నేలర

చరణము.

౧. యెటులగలిగెనీసంసారం బిదియెవరూ చెల్పరూ
వొట్టివియిదియని తెలియక గూలితి- కట్టడితనమునని పుడూ
పొట్టకూటికై రట్టడిజెందియు- ఘట్టిగనినుమదినమ్మక చెడితిని॥ నేలర
౨. పుట్టుచుగిట్టుచు పోడిమిచెలియక- పుడమినిబొర్లి తినికనూ-మరివాగనూ
చుట్టాలుబంధులు- సుతులుహితులని చూడకనమ్మితినికనూ- నెరుగకనూ
మట్టుమాయనిమదినమ్మకమరి- నట్టెమురచితి హరహరశివశివ॥ నేలర
౩. నమ్మలేదుసేయీసంసారముమదినీ- నాహృదినీ- మొమ్మెలుగలదని
తెలిసియువిడిచితినామదినీ- నెమ్మదిలోపలయిమ్ముగనిన్నును
ముమ్మాటికినాసొమ్మనినమ్మితి॥ నేలర



౪. క్షేమతిరుమలాద్రీశుడవనినమ్మితిచాలా- యిదిమేలా
కామసంహారుడవనియునుగొలచితి- యీలా- గుణశీలా
కామితార్థములుగలుగగనిచ్చియు- రామలింగనిరయమునమరువక॥
నేలరరఘుపతినుతవరదా॥

౪౪= శంకరాభరణరాగం - ఆదితాళం.

పల్లవి.

పురారిదానవవిరామశంకర - మురారినుతసురపోషణా॥ పురారి

అనుపల్లవి.

ధరాదివందిత- యరాతిభంజన- వరాంబుజాతసుపోషణా॥ పురా

చరణము.

౧. హృదంచితాఖిల- పృథివీశ్వరాదిక- సదాహృదంబుజవాసినా
మదంబసహిత- చిదంబరేశ్వర- సదాశివరిపుసూదనా॥ పురా
౨. యిందూధరసుర- బృందావందితపద- ద్వందాసురవరశోషణా
నందీశ్వరాదిక-వందితసురముని- బృందాదికావరపోషణా॥ పురా
౩. కపాలకరధృత- విశాలమున్మథ- నిపాతదానవభీషణా
అపారశ్రీకర- కృపాంచితాముని- సుపాలలింగసుపోషణా॥ పురారి

౪౫= ఖమాచిరాగం - ఆదితాళం.

పల్లవి.

సాంబశివాయనవే- దుష్టామానస॥ సాం

అనుపల్లవి.

సాంబయనుమని- యనుదినమునునీ- డంభముడుగనే
మరిమరిజెప్పితి॥ సాంబ

చరణము.

౧. గనుమా- దినమునుమనమునవినుమా- యనయముశివశివయనుమా
ఘనయూపదదొలగునుగనుమా- కాయజవైరిని- ఘనముగవేడన
పాయుమమాయను ననవినవేశ్వతులను॥ సాంబ



౨. నిడుమా - నిత్యముహరయనినుడుమా - మనమునకపటముఁవిడుమా
కడుమాదమునపెద్దలగనుమా - కడుసంసారము - నిడుములగడమని
యెడయెడతడయక - కడుమదిమదినిడి॥ సాంబ

౩. పొమ్మా - ఘనులనుగనిమరిరమ్మా - యెప్పుడుశివయనుకొమ్మా
యితరులనమ్మకుసుమ్మా - నమ్మినవారికిసొమ్మైయున్నరి
యిమ్మహినమ్మి మనమ్మునవెమ్మిసి॥ సాంబ

౪. వినుమీ - తిరుమలగిరీశునిగనుమీ - జననములేదికగనుమీ
మననముజేయుటమనుమీ - రామలింగని - కనయముమననమున
ఘనపదవినిగని కనగనునిచ్చిన॥ సాంబ

౪౮= కేదారగౌళరాగం - రూపకతాళం.

పల్లవి.

ఈశపాశమోచన - శ్రీశనుతభస్మాంగ - శశిధరజగ॥ ఈశ

అనుపల్లవి.

కాశినాథవరద - నినునిరతము - రమ్మనిగావేడితిమరి - నెమ్మదిగను॥ ఈశ

చరణం.

౧. కుమతమతమర్దన - విమతమతమూలనష్ట - కలపిధములల
సమతనొందించి - కలమతములు - స్థిమితముగాజేసితివామేలనగను॥ ఈశ

౨. భక్తప్రియాభవహర - ముక్తినిగోరితి - నినుమరిమరి
విరక్తుడనైసరివేడితినిక - రక్తులకుక్ - భక్తినిగలిగించితివట॥ ఈశ

౩. క్షేమకరత్రిభువన - కామితార్థవరద - హరహరశివ
రామలింగవినుతశుభకరవర - వాసిగనీదాసుడననిపోషించుము॥ ఈశ॥

౪౯= ధేనుకరాగం - ఏకతాళం.

పల్లవి.

తలువలేరుసాంబ - తత్వమార్గమును॥ తలు



అ ను ప ల్ల వి.

ఫలమింతని- గానకనిక- మలయుచుందు రేగాని॥ తలు

చ ర ణ ము.

౧. ప్రేమతోడ- కామమిడిచి- సామియని- భూమిలోన
వెతకిగాన లేకనూ- భామవైపయా- గామసీలులయ్యే రేగాని
రామలింగవినుత॥ తలువ॥

౪౮= బాందుస్వరము - ఏకతాళం.

ప ల్ల వి.

వదిలెను- భవంబునాకు- నినుగన॥ వదిలె

అ ను ప ల్ల వి.

ముదంబుగా- మనంబులో- నినుగన॥ వదిలె

చ ర ణ ం.

౧. మారునీ- మారనీ- చారుసౌందర్యముల్
యారయమును నెవ్వారుగనిరిలక్- యేరికిగనగా
తరమూ పశుపతి- నినుగన॥ వది

౨. యిమ్మానుమా- యిమ్మహిని- నెమ్మోదము- క్రమ్మాడగ
ఫలములునియవే- నలయకభువినీ-తలచికొలువగా
యిలనులింగనికిమరి నినుగన॥ వదిలె

౩. భీమా- నలకయుదగు నెనామీద- నుచితముగనికభూమిక్
మనమునదలపవే- మోదమునను బొగడగనలవియె- నినుగన॥ వదిలె

౪. తిరమై- నికనా- పరమై వేలసెక్- సురపావనయో- దరహాసముఖినీ
పరమతిగా- నొసగుటచే- కరమరుదుక్- సమ్మతిచేసుఖమ్ము
గలిగెను- నినుగన॥ వదిలె

౫. వంతేల- నినుగనగనిరంతంబు- చింతాలు- వదిలెనుగద
సంతోష- మెంతాయు- మనసునవిన- స్వాంతంబు

లోనప్రీతినా- కెంతో మోదమై- రంతురాలువాసెను
సంతోసమొందినే- కాంతతవడసితి- నినుగన॥ వదితె

౪౯= కీర్తన- ఏకతాళం.

పల్లవి.

ఫాలనేత్ర- నన్నుగావరా॥ ఫా

అను పల్లవి.

శూలీ- నాదాపుజేరి॥ ఫా

చరణం.

౧. పాపారూపుడను- వోపినేలు॥ ఫా
౨. మేరు- తీరు- గేరు- చారుసుం- దరాకార॥ ఫా
౩. నేమందు- నీయందు- నాడెంద- మూపొందు- జెందింపజేయ॥ ఫా
౪. ఘనసురవందన- వినులింగవినుత- ధనసఖశ్రీకర- మునిజనవినుత॥ ఫా
౫. నినుదక్కగనా- మనమేరినిమరి- మునువేడదువో- మనసిజహార॥ ఫా
౬. యెన్నడు- నీతొంటిరూపును- గానగ- నున్నదోహృదిని
సన్నుతించగ- మన్మాథపీడకు- పున్నాగభూషణ- నన్నాదరించుమి
మిన్నంటుశిఖయూ- పన్నగనుత॥ ఫాల॥

౫౦= దర్బారురాగం - ఆదితాళం.

పల్లవి.

నీలకంఠరారా- వేగమె- జాలిజూపవేరా- మేరా॥ నీల

అను పల్లవి.

కాలకాలనిన్నేమరుగొలిచెద, కాళిమనోహార కరుణచెసీవిటు॥ నీల

చరణం.

౧. వేదవినుతగావా, నాతో, వాదమేలబ్రోవా, రావా
సాధువినుతదశ, నాదప్రమోదిత, ఆదిపరాత్పర, యాదరించుటకు॥ నీ



౨. కల్లనిడిచి నాపై, నీకృప, జల్లు వేగ(బ్రా)పై, దాపై
యెల్లలోకములయెల్లెడల, మెల్లెనగదలగ, చల్లననీవిటు॥ నీ
౩. జ్ఞానమొసగి(బ్రో)వా, నీవ్రను, జ్ఞానమయుడగావా, రావా
మానహీనుడను, హీనమానసుడ, పూనియదయతో మానకనీవిటు॥ నీ
౪. కుండలీంద్రహారా, నాపై కుపితమేలరారా, వీరా
మండల(ప్ర)విమల, చండభాస్కరన, ఖండతేజమయ
అండబాయకిటు॥ నీల
౫. క్షేమతిరుమలాద్రీ, నివసిత, రామలింగసుతునీ మతినీ
కామితార్థములు, గలుగగనివ్వను, (ప్రే)మమీరమరి
బిరబిరనీవిటు॥ నీల॥

౫౧= కీర్తన - ఆదితాళం.

పల్లవి.

నామొరాలకింపవేమిరా - సాంబ॥ నా

అనుపల్లవి.

యేరా- నేమనవిని జేయగరాల- స్థిరతరవరధీరా
మరినీకుయిదిమేరా - వరశూర- యఘదూర- ఫణిహార-వరమీర॥ నా

చరణము.

౧. వొద్దూ- నామనవినివినిపోవద్దు- మొరవిననీకునుముద్దు
యరమరచేయవొద్దు నాతోరద్దు- యేప్రొద్దు-యఘవొద్దు- తగవొద్దు॥
౨. కంటి- కనులనుమరగంటి- శృతులనుముసువింటి
సంతోషము మదిగంటి-కనులంటి-మరియుంటి-వనివింటి-ముక్కంటి॥ నా
౩. తెమ్మాభక్తినికచేకొమ్మా- ముక్తినినాకునిమ్మా-నినుగాదనివేరెనమ్మా
రారమ్మా- సరెతెమ్మా- వరమిమ్మా- తేతెమ్మా॥ నా
౪. నాథా- నేనీవాడనుగాధ- నాతోనీకునువాద- నేనినువిడువనుగాద
శృతవేదా- బహుమేధా- యతిమోదా ధృతనాదా॥ నా



౫. క్షేమా-తిరుమలగిరివర ధామా- పంచాక్షరివర నామా
రామలింగవర కామ- హృదిధామా- శివకామా
భవనామా- జితకామా॥ నా

౫౨= రామామెట్టు - ఆదితాళము.

పల్లవి.

శ్రీవుమామనోహరా కృపాకర॥ శ్రీ

అనుపల్లవి.

పురాహరా - సూర్యకోటిసమప్రకాశ- సూరినామొరా
వే, రే, పీ, నా, లేరుపశుపతీ॥ శ్రీ

చరణము.

౧. భాసితాంగ గాసినొందినానురా- యిదేమిరా-
వాసుకివరవినుత దరహాససుందరా
దో, సీ, లా, గ్గి, యీశవేడితి శ్రీ

౨. పాపరహిత పావనావనా- మరేమిరా- కోపరహితసుగుణదీప
కోపమేమిరా, శ్రీ, పా, ను, త, రూపుజూపరా॥ శ్రీ

౩. క్షేమతిరుమలాద్రివాసఈశ- అదేమిరా- రామలింగవరదనీ
ధామమొసగుమీ, ప్రే, మా, లే, దా, స్వామిశివకరా॥ శ్రీ

౫౩= కీర్తన - ఏకతాళము.

పల్లవి.

శివునిజూతాము రారె॥ శి

అనుపల్లవి.

శివభక్తులారయీభవుజేరి శీఘ్రముగ॥ శివు



చ ర ణ ము.

౧. మెల్లెమెల్లనమన- ముల్లములోపల
చల్లనగనియును- కల్లలిడిచియు వేగ॥ శివు

౨. నవవిధభక్తియు- నయముగజేసియు
భవములబాయను, శివశివయనుచును॥ శివు

౩. కోటిసూర్యులబోలుమేటిప్రకాశుని
ధాటిగనుండెడుత్రి- కూటముజేరియు॥ శివు

౪. క్షేమతిరుమలగిరి, ధాముడతడట
రామలింగనిమరి ప్రేమతోనేలెనట॥ శివు

౫౪= శ్యామరాగం, చాపుతాళం.

ప ల్ల వి.

ఫాలనేత్రనన్ను పాలించవేలరా

అ ను ప ల్ల వి.

చాలగదయను, కాలునిబాధను, కడువడిద్రోయను, వేళనయిదేనూ
ఓ శంకరా, పరులవేడలేను, రావయ్య, రావయ్య, రావయా॥ ఫా

చ ర ణ ము.

౧. కన్నతండ్రివని, కడుముదమునననిన్ను, గానగనైతిని, తిన్నగమదినీ
పన్నగహృదిని, చిన్ననిబుద్ధినీ, ఓ, శంకరా, చిన్నవాడననికన్నడ
కాయకు, కాయకు- కాయకు॥ ఫాల

౨. వెండికొండనుండు, దండిదేవుడవని, యండనుజేరిన
మండితసద్గుణా, కుండలిభూషణా, దండనుజేరిన
ఓ శంకరా, మెండొడ్డినన్, విడ, నాడకు, నాడకు, నాడకురా॥ ఫాల

౩. ధరతిరుమలాద్రీశ- వరరామలింగనుత- సురనుతపాదా
హరహరవాద- పరమివరాద- చిరుతనేగాద
ఓ- శంకరా- పరుడవీవని- గోరెద- గోరెద- గోరెదా॥ ఫాల



౫౫= నాదనామక్రియరాగం - ఆదితాళం.

పల్లవి.

శివరాత్రిమహిమేమని దెలుపుదు- శిద్ధపదవిగద॥ శివరాత్రి

అనుపల్లవి.

భవబంధబులు- బారగదోలును- భద్రపదవిగద॥ శివరా

చరణము.

౧. యోగులకెప్పుడు- యోగము దెలిపిన- యోగమెగద॥ శివరా
బాగుగరోగులరోగపీడలును- బాపునుగదమరి॥ శివ
౨. పంచాక్షరివరపంచవింశతులు- పరగదెల్పుగద॥ శివ
అంచితంబునను- సంచితంబులును. వంచనజేయును॥ శివ
౩. శివయోగులకును చిత్తమునిల్పిన- స్థిరపదవేగద॥ శివ
భవబంధంబులుబారగదోలిన- భావమెగదమరి॥ శివ
౪. సర్వపాపములసమయజేయును- సగవిదెలియుడీ॥ శివ
మురయుచునిత్యము స్థిరముగనుండుటే- ముక్తినిచ్చుగద॥ శివ
౫. క్షేమతరంబగు- నీమమువిడకను- నిరతమునుండుటె॥ శివ
రామలింగనిరయమునసేలిన- దారాత్రేగద॥ శివ

౫౬= కీర్తన - ఏకతాళం.

పల్లవి.

శశికళమకుటవినుతింతు దేవా॥ శశి

అనుపల్లవి.

శేష- భూషా- ధీశా- పోష॥ శశి

చరణము.

౧. నాధుడై-వేదుడై-సాధుడై- మోదుడైసాధులబ్రోవను- భేదములేకను
మోదముగలిగినపశుపతి॥ శశి



౨. అమ్మారునిక్- జిమ్మితివక్- నమ్మితినిక్- నెమ్మాదినక్
సమ్మతినిటకు నిజమ్ముగరమ్మనిశిరమ్ముగవేశీ॥ శశి
౩. రామలింగని నిరతముగావగరాదే - క్షేమములన్నియుచాలగనియ్యగ
రాదె- సమహృదిరూపుడవనిగా- నమలసదయ- యమరవినుత॥ శశి
౪. రావా- మొరవినవలెను దేవ- మరువనుగదనీసేవ- బిరబిరనురికియురావ
ప్రియమున॥ శశి
౫. యెంత్రైననీ- పదాముల- నింత్రైనన్విడ- పంతామె- సుంత్రైన
నిరంతాము- మంతనమున నేమరువక- గొలచెదనిను॥ శశి

౫౭= యిందుస్తానితోడిరాగము - అటతాళం.

పల్లవి.

యెందుకునిందునరావు - యెందునడాగినావు, ముందునకాళ్ళరావా

అనుపల్లవి.

సందునుదొరకాలేదా॥ యెం

చరణము.

౧. అశనముదినలేద- విషమునుదినవాద,
వెసనముగలుగలేద, పశుపతినాతోవాద॥ యెం
౨. యిల్లువనుండబాధ, కల్లుయుకడవదాగ
చెల్లునయిదిబాగ, మెల్లనరావవేగా॥ యెం
౩. రాళ్లనురువ్వినార, వూళ్లోమరిలేవా
ముల్లెయునడిగినాన, తలుణమియిటురానూ॥ యెం
౪. కట్టనుబట్టలేదా, ఘట్టిగధనుదుడెవడా
కట్టితితోలెకాదా, కట్టడియిదిమేలా॥ యెం
౫. వేడుకయిల్లులేదా, కాడుననుండనేల
తోడునభూతాలేల, జూడగయిదిలీలా॥ యెం



౬. అరమరమరిం కేమి, పురహరశంక లేమి
హరహరహాదిం కేమి, బిరబిరరావ దేమి  యెం

౭. మామయునిందించేన, మదనుడునడ్డపడెనా
వ్రమయుమరిపోరెనా, శ్రమయుబహుగలిగెనా॥  యెం

౮. తిట్టెదచూడునికనూ, వట్టుబెట్టెదచూడికనూ
వట్టెదిగాదుగనమూ, గట్టెదచూడుహృదినీ॥  యెం

౯. ధామతిర్మల్గిరినివాస, సామిశంకరననున్నగావు
ప్రేమచేనిందూనరావూ- రామలింగనివేగబ్రోవ॥  యెందుకు॥

## ౫౮= మంగళహారతి.

### పల్లవి.

కర్పూరాహారతిదేరే- నేర్పుతో- మన- సర్వహారునకు॥  కర్పు

### అనుపల్లవి.

దర్పకునిధ్వంసునకు- సర్పవేణులార-
సురకుల - సార్వభౌమవినుతూనకు॥  కర్పు

### చరణం.

౧. నందనందనవినుతునకు- నవనీపాలితధీరునకు- మందహాసవదనునకూ
యిందుధరుడైనగో- బృందవందితునకు॥  కర్పు

౨. సర్వమంగళాకారునకు- యక్షగర్వసురమునిపాలునకు - సర్వలోకనట
నునకు, సవిశేషుడైనభవభంగ- గంగాధరునకు॥  కర్పు

౩. కుండలీంద్రహారునకు- చండభాస్కరతేజునకూ- మండలత్రయవాసున
కు, చండియీశుడైనయట్టి- దండధరదండితునకు॥  కర్పు

౪. ఈశతిర్మల్గిరీశునకు- వాసిగలింగయపోషునకు- ఘూసురాదిహృదయు
నకు, కాసివాసుడైనపరమేశునకుమీరువేగ॥  కర్పు



౫౯= హిందుస్తానికాఫి - జులువతాళం.

పల్లవి.

జయజయహరతి- యభవ- మహేశా॥ జయ

అనుపల్లవి.

జయహరతి త్రిపురవినాశ॥ జయ

చరణం.

౧. త్రిపుటిరహితవర- త్రిగుణాతీత- కపటనాటక శ్రీకరిముఖతాత॥ జయ

౨. రవిశశినయనసు- కవినుతపాల- దివిజమునినుత- నుతపరిపాల॥ జయ

౩. కార్యాకార్యసుకారణమూర్తి- ఆర్యావినుత శ్రీ- యాదిపరమూర్తి॥ జ

౪. మండితకుండల-చండప్రతాప- కుండలింద్రధరకుధరసుచాప॥ జయ

౫. దానవభంజన- ధర్మసుదీప- దశరథసుతనుత- స్మరవరతాప॥ జయ

౬. క్షేమతిర్మల్గిరి- ధామసునామ- రామలింగనుత- క్షేమసుకావ॥ జయ

౬౦= నీనామరూపమునకు - అనేవర్ణమెట్టు.

పల్లవి.

నీభవ్యరూపమునకు నిత్యజయమంగళం॥ నీభవ్య

అనుపల్లవి.

ప్రమదాదివినుతమైన- పావనపదములకు॥ నీభవ్య

చరణం.

౧. రవిశశినేత్రునకు- ప్రవిలమగాత్రునకు॥ నీభవ్య

౨. కైలాసవాసునకు- కాళీవినోదునకు॥ నీభవ్య

౩. అసమానతేజునాకు- విషమాసునేత్రునకు॥ నీభవ్య

౪. వేదాంతవేద్యునకు- సాధుసేవితునకు॥ నీభవ్య

౫. నాదావినోదునకు- భేదాదిదూరునకు॥ నీభవ్య

౬. కామితఫలదునకు- రామలింగవరదునకు॥ నీభవ్య



౬౧= సావేరిరాగము - ఆదితాళం.

పల్లవి.

మంగళంభవతు తేసదా- హేసాంబ- శంభో॥ మ

అనుపల్లవి.

మంగళంభవతు తేన- యంగజాంతశుభదవిభవ
భృంగిరాదిప్రమదగణసు- సంగమంగళభావదేవ॥ మ

చరణము.

౧. దివిజవినుత- భువిప్రకాశ తే- శ్రీశంభులింగ
భవవినాశ- కవిప్రకాశ తే- శివభవానివినుతపాద
ప్రవిమల శ్రీశుభ్రగాత్ర- సవనధ్వంసరవిసునేత్ర
పవనసఖమిత్రపాత్ర॥ మం

౨. సుందరాంగశుభచరిత్ర తే- ప్రమదాదినాథ
చందనాదిచర్చితాంగ తే- నందనందనాది
వినుత- మందహాసచంద్రశీర్ష- వందితామరాది
బృందగంధశింధురచర్మవసన॥ మం

౩. వికటదనుజభంజనాయ తే- శ్రీశంకరాయ
ప్రకటభువనపాలనాయ తే- భృకుటిమధ్య
నిలయతేజ- సుకరసుజనరక్షణాయ
ప్రకృతిరహితపరమతేజ పావనాయపరమదాయ॥ మం

౪. క్షేమతిరుమలాద్రిఈశ తే- శ్రీమహాదేవ
రామలింగదాసవరద తే- కామితార్థదాతవిభుద
ప్రేమధామరామవినుత- నామసోమభక్తనామ
స్వామిశ్రీభవవిరామ॥ మం

శ్రీశివార్పణమస్తు.





శ్రీ ర స్తు.

శ్రీగురుభ్యోన్నమః.





# గు రు కీ ర్త న లు.



౽౨౽ నాటరాగం - ఆదితాళం.

ప ల్ల వి.

భజామిసద్గురునాథం- సతతం॥ భజామి

అ ను ప ల్ల వి.

అజాదిసురముని- ద్విజాదిరూపం॥ భజామి

చ ర ణ ము.

౧. వరం-భవభయహారం- పరాత్పరతరం- నుతసురవరం- శృతమనో హారం, శమితదుర్భరం-అమితపరతరం-దక్షిణముఖవరం-సదాహృది॥

౨. రవం- ప్రణవఘనరవం- హృదంతరరవం-దశవిధరవం-స్థిరతరభుగ్రివం- ప్రకృతిపరిభవం పరాత్పరశివం- రుషియనుభవం-సదాహృది॥ భజా

౩. ఘనం- ప్రజ్ఞానఘనం- మునిజనధనం నిరతనిర్గుణం- పరమపావనం- పతితపావనం- నమితసురజనం- దత్తగురుఘన- సదాహృది॥ భజా

౪. పతిం- రామలింగగతిం- వేదవాగ్రతిం- సకలజగస్థితిం - శమితదుర్గతిం వినుతవిశృతిం- పశునాంపతిం- యోగిజనగతిం- సదాహృది॥ భజా

౬౩= హిందుస్తానికాపి- ఆదితాళం.

పల్లవి.

భజరేమానసశ్రీగురుదేవం॥ భజరే

అనుపల్లవి.

భవభయమోచన- భాసురభావం॥ భజరే

౧. ఆనందామృత- యాత్మప్రకాశం- అఖిలాగమనుత- అతులసువేషం॥

౨. నామరూపపరినటనవిహీనం- కామరాగజిత- ఘనతప్రవీణం॥ భజరే

౩. నాదుబిందుకళనాదాతీతం- సాధుహృదయసంతాపహరంతం॥ భజరే

౪. భావాభావవిభావితసారం- భాసురప్రవిమలప్రణవాగారం॥ భజరే

౫. క్షేమతిరువంలగిరి- ధామనివాసం- రామలింగవర- కామితభాసం॥ భజ

౬౪= యిందుస్తానికాపి - ఆదితాళం.

పల్లవి.

మనవినవేదుర్మతీ॥ మన

అనుపల్లవి.

అనవరతమునీ- యాత్మలోగురునిడి॥ మన

చరణం.

౧. వాదములిడమరి- సాధులగూడియు- నాదాతీతుని
బోధగనుటకిక॥ మన

౨. ఆధారము మొదలాదిగనిలచిన - వేదగోచరుని- పాదుగనుటకిక॥ మన

౩. యెన్నిచదువులు- నేర్పడజదివిన- సున్నని తెలిసియు సుగతిగనుటకిక॥మన

౪. గురుడువిధించిన-గుణములుగలిగియు-పరిపరి తెరువులుపారవిడువుమిక॥

౫. క్షేమతిరుమలాద్రీశుడు- గురుడని- రామలింగదురయమున దెలుపగ॥

నాదనామక్రియరాగము - ఆదితాళం.

పల్లవి.

స్మరరెగురుచరణం- హేమానస॥ స్మరరె



అ ను ప ల్ల వి.

స్మరరే గురువరచరణసరోజం-హరిహరపూజితసురవరభూజం॥ స్మర

చ ర ణ ము.

౧. నిత్యనిరంజననిర్మలరూపం- సత్యసుజనపరి- హృదిస్థితదీపం॥ స్మరరే
౨. ఖేదభేదపరిఛేదితదేవం- సాధుహృదయపరి- మోదితభావం॥ స్మర
౩. లక్ష్యాలక్ష్యసులక్ష్యాతీతం- సాక్షిజగత్రయ- సర్వాతీతం॥ స్మరరే
౪. క్షేమతిరుమలగిరివరభాసం- రామలింగహృదిదేవగుహేశం॥ స్మరరే

౬౬౽ శహనరాగం - ఆదితాళం.

శ్లో॥ గుకారంచగుణాతీతం రుకారం రూపవర్జితం।
గుణాతీతమరూపంచ గురురిత్యభిధీయ్యతే॥

ప ల్ల వి.

గురురూపమిదియని తెలియ- నరులాకువశమా నే॥ గురురూ

అ ను ప ల్ల వి.

హరిహరబ్రహ్మాదుల- తరమూగానటువంటి॥ గురురూ

శ్లో॥ గురూణాంవర్ణాత్యాగో అణురేణుసువృత్తమం।
పరిపూర్ణంపూర్ణమేవ పూర్ణేయచలసముద్రవత్॥

చ ర ణ ము.

౧. వర్ణానుముదియనివర్ణింపతరమానె- వర్ణానిర్ణయములేక
పూర్ణాద్వైయున్నయట్టి॥ గురు
శ్లో॥ అద్వయంచద్వయంచైవ ద్విభేదంరహితంపరం।
సార్వకాలమిదంసాక్షా ద్గురురూపంవిశిష్యతే॥
౨. ద్వైతాద్వైతవిశిష్టాద్వైతములుగాక - ద్వైతాద్వైతభేదరహితమై-
యున్నయట్టి॥ గురురూ
శ్లో॥ నిరాకారం నిరాకారం నిరాకారం పునఃపునః।
నిరాకారంస్వతస్సిద్ధం సాక్షిసాధనవర్జితం॥



౩. సాకారనిరాకారశ్రీకారములుగాక- యేకాకారంబైయుండే
యేమానియనరాని॥ గురు

శ్లో॥సగుణం నిర్గుణంనాస్తి గుణాతీతనిరంతరం।
సార్వకాలమిదంసాక్షాద్గురురూపంవిశిష్యతే॥

౪. గుణాగుణములులేక-గణనాతీతంబై యొప్పి
మననాతీతంబైన ఘనరామలింగవరదు॥ గురు

౬౭. మాళవగౌళరాగం - జులువతాళం.

పల్లవి.

గురునివేగజేరబోర- గురుతుదెల్యవోరిజీవ॥ గురు

అనుపల్లవి.

నిరతమాఖండరూప- నిర్మలాత్మునైనపరుని- చరణకమలంబునీవు
మరువాక- మదినుంచుకోని॥ గురు

చరణము.

౧. దండిగానుకొండలేదు- దాటిపైననున్నగురుని- నిండువెన్నెలలోన
మండితమైనిండియున్న॥ గురు

౨. కంటిపాపనంటియున్న- జంటవెలుగువెంటనరిగి
మింటిమంటికేకమైన దంటానైనపరునిజూడ॥ గురు

౩. క్షేమతిరుమలాద్రిపుర- రామలింగవరదునెవ్వడు
ప్రేమమీరగొలచినీవు- ప్రియముతోడనుండువేగ॥ గురు

౬౮. పూరికల్యాణి - రూపకతాళం.

పల్లవి.

గురుదెచటదాగినాడో- గురుతుదెలియదేమిసేతు॥ గురు

అనుపల్లవి.

పరువులిడగజేసెనమ్మ- పరుడునాకుగానరాడు॥ గురు



చరణము.

౧. కలనునతడువొచ్చినాకు- కర్మదోషకలనబాపి
చెలమః వేలయనుచునన్ను నలకదీర్చిపాయనమ్మ॥ గురు

౨. చింతమానుతొరటిలోన-చిలుకలైదు లేపిజూపి
చింతదీర్చిచాలనాదు- వంతబాపిపాయనమ్మ॥ గురు

౩. కంటిపాపనంటియున్న- రెంటినడుమనంటజేసి
తంటలేలయనుచుజెప్పి- కంటిమరుగుజేసిపాయ॥ గురు

౪. మూటిలోనస్నానమాడ- నాటజేసిసూటిదెలిపి
కోటలోనయున్నయట్టి- బోటిజూపినరిగెనమ్మ॥ గురు

౫. పుట్టలోననున్నపాము నట్టలేపిధట్టిచూపి
ఘట్టిగయిదిమట్టుదెలిపి కొట్టకొననుజేర్చిపాయ॥ గురు

౬. పంచవింశతికవలనుండు- మించువెలుగుపొంచిచూపి
సంచితములుబాపినన్ను- వొంటినుంచిపాయనమ్మ॥ గురు

౭. క్షేమతిర్మలాద్రినిలయు- నామరహితునేమమెసగ
రామలింగవరదుడంచు- ప్రేమచేతదెలియనైతి॥ గురు

౬౯ = కాంభోదిరాగము - అటతాళం.

పల్లవి.

గురుదేవైవమని- గుణముగలిగినీవు- గురుతుదెలియరాదటే ఓమనసా-

అనుపల్లవి.

పరిపరివిధములపరువులుబెట్టాక- స్థిరమతివైయెంతో
సిరతాముమదిలోన॥ గురు

చరణము.

౧. తల్లిదండ్రులుదాతదైవాముగురుడాని-తలపోయరాదటవే-వోమనసా
తలపోయరాదటవే- యుల్లాములోపల- మెల్లలోకంబులు
కల్లాగనమ్మినీవెల్లాబుధులుబోగడ॥ గురు



౨. భావభావరహితభావా మెగురుడాని - భావమందున దెలియవే
వోమనసా భావమందున దెలియవే-భావభావరహితభావమె
పరమాని సేవిన జెప్పిన- భావించివినవైతి॥ గురు

౩. నిరతాముపరతత్వ నిర్మాలజ్ఞానులౌ- నరులాను సేవించవే
ఓమనసా నరులాను సేవించవే- ధరతిరుమలాద్రీశుడైన శ్రీగురుజేరి
వరరామలింగానివరదుడైనపరుని॥ గురు

౭౦= ముఖారిరాగం - ఆదితాళం.

పల్లవి.

గురునిభక్తులారరండీ- పరమునుగనుటకునూ॥ గురు

అనుపల్లవి.

గురునిజేరిమన- దుర్గుణంబులు- దరిగితరింతాము॥ గురు

చరణము.

౧. పరులికమరిమనమూ- లనిమెడి- దురుసుభావమును
మరచిమెప్పుడు- స్థిరమననిలుకడ- మరువకయుందాము॥ గురు

౨. సాధనసంపత్తులూ- గలిగీ-సాధులతో మెలగీ- పాదుగనుండెడి
పరమాత్మునిగనె-బోధనుగనుటకునూ॥ గురు

౩. తొలుజన్మముమనమూ - జేసిన- దోషంబులనెల్లా
తొలుగజేసిమరి-దోచె ప్రపంచము- కలగాదెల్పునటా॥ గురు

౪. అంధాకారంబైయుండెడు - ద్వంద్వబుద్ధినెల్లా
మందముబాపియు- సందేహంబులు- సమమయజేయునటా॥ గురు

౫. క్షేమంబునమనమూ- ప్రేమచే- నేమముదప్పకను- రామలింగని
స్వామినిగనుటకు- రయమునబోదాము॥ గురు

౭౧= బిలహరిరాగము - ఆదితాళము.

పల్లవి.

జీవసీవిది తెలియరామరి- దేవునిందేగానరా॥ జీవ



అనుపల్లవి.

జీవదేవులరెంటిభేదము- భావమునమరి దెలియరా॥ జీవ

చరణము.

౧. పొందుబొందియున్నైననెప్పుడు- భ్రాంతిమరివిడజాలవు
కాదువాద్దికినేగెటప్పుడు కాదనివాడొక్కఁడూ॥ జీవ

౨. మాటలే ప్రపంచమని - మాటిమాటికి దెలిసితే
చేటులేనిచోటుచిక్కును- మాటమానియుండితే॥ జీవ

౩. కాదుయిదియనియనకను-మరియాను కాదయనకనూ
పొదు గాయిద్వందమెప్పుడు- లేదుసర్వమునీవెనూ॥ జీవ

౪. యెన్నిచదువులుజదివినామరి- సున్నయనితా దెలిసితే
యెన్నరానిపదవిజిక్కును- వున్నదేదో తెలిసితే॥ జీవ

౫. నిత్యదుఃఖము నెందుకగుమరి- నిన్నునీవె తెలసితే
సత్యముగ బ్రహ్మం జెయగుదువు- సర్వమెరిగియరోసితె॥ జీవ

౬. ముందు వెనుక నెందుజూచిన- సందులేకను వెలుగునూ
అంధునకు అద్దంబువలెనీ- వెందుగానవు వేగనూ॥ జీవ

౭. సత్యమెరిగినగురునితోడను- సంగతీతా జేసినా
నిత్యముక్తుడయ్యానుమరి తా- నిజముగామదినిలిపినా॥ జీవ

౮. అందముగనిదిగురుడు దెలుపక - నందజెందునుభావమూ
పొందుగావరరామలింగని- వరదుడెరుగును భావమూ॥ జీవ

౭౨. ఝంఝూటిరాగం - ఆదితాళము.

పల్లవి.

గురుడెంతో శ్రేష్ఠుడే- మానినీమణినా॥ గురు

అనుపల్లవి.

పరిపరివిధములపరువిడెమనమును - స్థిరముగనిలిపెడి
మరుగుదెలుపు॥ గురు



చ ర ణ ం.

౧. దేహవాసనయు- బాయకనెప్పుడు- మోహముడుగదని
మొదలేదెలిపెను॥ గురు

౨. సకలశాస్త్రములసారము దెలిపియు- వికలముబోపియు
సకలమునీవనె॥ గురు

౩. యెన్నివిధములను- వెదకినగానిక- వున్నదినీవనె
యూహదెలిపెనిక॥ గురు

౪. బంధమోక్షములభ్రాంతులు రెంటిని- సందడిబాపియు
సత్యముజూపిన॥ గురు

౫. రంగుగరామలింగని- పొంగుచుతత్వము
పొసగదెలిపినయా- మంగళకరుడగు॥ గురు

౭౩= హిందుస్తానికాపి- ఆదితాళము.

ప ల్ల వి.

రావేగురుదేవ- రక్షించుస్థిరభావ॥ రావే

అ ను ప ల్ల వి.

రావవేనాహృది- సారసమునుజేర॥ రావే

చ ర ణ ము.

౧. మోహినిదీనుడను- మొరవిననీవేకాక- ద్రోహముంచకను
మోహముద్రుంచుటకు॥ రావే

౨. పరిపరివిధములప్రస్తుతిజేసెదను- సరగుననమనమున
సంశయముంచక॥ రావే

౩. పాపినిద్రోహినని- కోపమునుంచకను- వోపికతోనిక
రూపముజూపుటకు॥ రావే

౪. క్షేమతిరుమలగిరి- ధాముడవనినిను- రామలింగడువేగ
ప్రేమతోదలువగ॥ రావే



## ౭౪= జంఝూటిరాగం - రూపకతాళం.

మొరయాలించు ఆ సేవణాం,

పల్లవి.

నిరతమేనునిన్నుగొలుతు- పరమగురువరా॥ నిర

అనుపల్లవి.

కరుణయుంచినన్నుగావు - కపటమిడిచిరా॥ నిర

చరణము.

౧. ఆశనొందియీప్రపంచ- మేంతోనమ్మితీ
మోసమాయనేమి శేతు. యెట్లునాగతీ॥ నిర

౨. నిలువదేమి శేతుమనసు- నీదుపథమున
నలువశ్రీశులీశులెపుడు- గెలువలేదనా॥ నిర

౩. వొద్దునీకనుదీసిపొందు- రద్దికీడ్చెగా
రద్దిబాపియికనునీదు- వొద్దజేర్చగా॥ నిర

౪. నీదుభక్తిమరువనట్లు- నిలుపుమనమున
నీదురూపుచూపుమెపుడు- నిలుపునాత్మన॥ నిర

౫. క్షేమతిరుమలాద్రివాస- ధామశుభకరా
రామలింగవినుతమోద- ప్రేమశ్రీకరా॥ నిర

## ౭౫= కీర్తన - ఇంగిలీషువర్ణం- ఆదితాళం.

పల్లవి.

గురుదయానిధే- పరమపావనా॥ గురు

అనుపల్లవి.

పరతరాత్మ రాత్పర- పాపభంజన॥ గురు

చరణం.

౧. సదయహృదయకా- సదమలాత్మక
హృదయకమలవాస- వేదవిదితరూపకా॥ గురు

౨. సత్యభాషణా- సర్వపోషణా
నిత్యసత్యలోకపాల- నిర్వికారణ॥ గురు
౩. భక్తపాలనా- భవ్యసీలనా- యుక్తియుక్త
సహాయపరమ- ముక్తిఖేలన॥ గురు
౪. క్షేమదాయకా- కామదాహకా
రామలింగవరద- క్షేమనామశ్రీకరా॥ గురు

౭౬= శంకరాభరణం - చాపుతాళం.

పల్లవి.

అదిమేరపరమూ- భ్రాంతిజీవ॥ అది

అనుపల్లవి.

అదిమేరపరమునీ- హృదయారవిందమున- వదలాకసద్గురు
పదమూలునిల్పు॥ టది

చరణము.

౧. హంకారముడిగి - మదిలోనెపుడు - శంకాలుగడిగి
మంకుతనముమాని- మరువకగురుపద
పంకజములునమ్మి-పరగనుండుటెచాలు॥ అది
౨. వెతలేమిలేక- దుర్మార్గపు- కథలకుబోక
సతతాముపరతత్వ-సద్గోష్ఠిచేమించి
యతులితమతిలోన- యానందమొందు॥ టని
౩. అంచితముగను- పంచాక్షరి- మించితెలియుచును
వంచనలేక ప్రపంచవాసనమడచి- పంచవింశతికవలి
మించియుండెడుతత్వ॥ మది
౪. అదియిదియనక- మదిలోనెపుడు-కదలికలేక
కదలేటిమనమును- వదిగించినిలిపియు
సదయహృదయుడై- ముదముననుండుట॥ దిమే

౫. కామాముువిడచి- సద్గురుజెప్పె- నేమమునడచి
కామక్రోధముగడచి- కానికార్యమువిడచి
రామలింగనిహృదిని- ప్రేమనుండెడుతత్వ॥ మః

౭౭. మంగళహారతి - చాపుతాళం.

పల్లవి.

హారతిసద్గురురాయ- మంగళారతిసద్గురురాయ॥ హార

అనుపల్లవి.

హారతిదుగోసకలభువనస్వరూప భక్తవరదశుభకర
కోరికలుకొనసాగజేసిన ధీరవరపరమాత్మనీకిదే॥ హార

చరణం.

౧. ఓం- కారమందిరవాస- నిత్య- హంకారజితమితభాష
హంకారాదిగుణములెల్లను- శంకరాకర్పూరముగను
పొంకముతోజ్ఞానాగ్నియందున- శంకలేకగెరల్చినీకిదె॥ హార
౨. న- తజనపరిపాలఈశా- భక్తహితబోధవరమృదుభాషా
అతులితంబుగ- నారుచెక్రము- లితవుగాపల్లెరమొనచి౯యు
కుతుకమొదవగదుర్గుణంబులుగూర్చి౯వత్తులుగెరల్చినీకిదె॥ హార
౩. మం- త్రస్వరూపమహదేవ-సర్వ- తంత్రవినాశపరదేవా
మంతనంబునభక్తియనెడు-వింతతైలముచాలబోసియు
చింతలెల్లనువత్తిజేసి నేకాంతశిఖినగెరల్చినీకిదె॥ హార
౪. శి-వభక్తభవనాశఈశ- స్థిర-భవనామఫణివరభూషా
ధృవముతోడను- అష్టమదములు- సవినయముగావత్తిజేసియు
శివకరంబగుశాంతమనియెడు- నవీనాగ్నినిగెరల్చినీకిదె॥ హార
౫. వా- సవాదివినుతపాద- సకల- దాసపోషకగానమోదా
ఈషణత్రయంబులనెడు- మోసమైనవృత్తివత్తిగ
జేసిస్వస్వరూపమనియెడు- చిదగ్నియందుగెరల్చినీకిదె॥ హార



౬. యి-రమరలింకేమి జేవా- పరమస్థిరతరగురుమహాదేవా
పరమపావన- తిరుమలాద్రిపరమపురుష పాపనాశన
వరదరామలింగవినుత- కరముతోడనుభక్తియనిమెదు॥ హార

౭౮= మంగళహారతి - నాదనామక్రియ - అటతాళము.

పల్లవి.

హారాతిశ్రీగురురాయ॥ హార

అనుపల్లవి.

హారాతిప్రణవప్రకాయ-గురురాయ॥ హార

చరణం.

౧. మూటియందుయాశ- మాటిమాటికిరోసి- మూటిమూటినిమరి
దాటినిలిచి- వాటమైనయట్టిమూటికవలజేరి- కోటిసూర్యులువెల్గు
చాటజూపినదేవా॥ హార

౨. పంచావింశతికవలి- మించినతత్వాము- పొంచిచూపినట్టి
మించిజూపి- వంచానలేకప్రపంచవాసనబాపి- అంచితముగనాదు
సంచితముడిపీన॥ హార

౩. స్త్రీధనపుత్రులు స్థిరముగాదనిదెలిపి- నాదానుభవముల
నయముదెలిపి- ఖేదామోదంబుల- భేదామునణచీన
సాధనరహితవా- సదయశ్రీగురురాయ॥ హార

౪. ఆధారమాదిగనారుచక్రములందు- ఆదారమైసర్వ
మంటియుండ- వేదవేద్యనీదుపాదుతెలియలేక
వాదాముజేతురు- వరదశ్రీగురురాయ॥ హార

౫. పాపలోనున్నట్టి- దీపప్రకాశమై- చూపురూపులసందు
నీప్రాపునై- కోపతాపముల రూపుమాపినయట్టి
పాపరహితచిద్రూపశ్రీగురురాయ॥ హార



౬. క్షేమతిరుమలగిరి- ధామశ్రీపరదేవ-
రామలింగనిగురుస్వామియయ్యె- పామరమెడలించిపరమపదమునిచ్చి-
ప్రేమతో వెలిగిన ధీమహాగురురాయ॥ హరి॥

శ్లో॥ మంగళంగురుదేవాయ మహనీయగుణాత్మనే
సర్వలోకశరణ్యాయ సాధురూపాయమంగళం॥

శ్రీహరిహరగురుభజనకీర్తనలు

సంపూర్ణం.



శ్రీసచ్చిదానందపరబ్రహ్మార్పణమస్తు.





టి. - చెంగల్వరాయనాయునివారి స్వకీయ
మురహరిప్రెస్ - మద్రాస్, కృష్ణప్పనాయునిగుంటవీధి, 56 నెం, 1905.